# పారమార్థిక విచారము



సంకలనకర్త:

పాబోలు కోటయ్య
వైశ్యులు, ఏలూరు.



భక్తులకుచితము.

1957

7-10-58

# పారమార్థిక విచారము




సంకలన కర్త:

పాబోలు కోటయ్య

వైశ్యులు, ఏలూరు.




భక్తుల కుచితము.

1957



శ్రీల నలరించి, విఘ్నముల్ చెండివేసి
భక్తవర్యుల గాపాడు, భవ్యమూర్తి
నంతరాత్మఁదలంచి, ప్రార్థింతుసతము
విఘ్ననాథుని గణనాథు విమలభక్తి.



ఎల్లవిద్యల నివసించి ; హితముబెంచి
శ్రితులరక్షించి వెలయు భారతి దయాబ్ధి
నాదు జిహ్వాగ్రమున నిల్చి నాట్యమాడుఁ
గాత, త్రైలోక్యమాత విఖ్యాతిపూత.



3

ఓమ్.

# పారమార్థిక విచారము

## జయదేవులు భగవత్ప్రార్థన చేయుట

"ఈ సకలప్రపంచ మెవ్వనిచే సృజింపఁబడును? ఎవ్వనిలో నుండును? ఎవ్వనియందణగును? వీని కన్నిటికి నెవ్వఁడాధారభూతుఁడు? ఎవ్వఁడు పరమేశ్వరుఁడు? ఎవ్వఁడాదిమధ్యాంతరహితుఁడు? ఎవ్వఁడు సర్వము దానయయి వెలసినవాఁడు? ఎవ్వఁడు పరిపూర్ణుఁడు? అట్టి స్వయంభవుని, స్వయంప్రకాశుని, స్వప్రకాశుని, సర్వలోకేశ్వరుని, సచ్చిదానంద స్వరూపుని, దేవాదిదేవునిఁ బ్రార్థించుచున్నాను. జగములనెల్ల నొక్కమాఱు బయలుపఱచుచు, నొక్కమాఱు తనలోపల నణచుకొనుచు, తుదకు సర్వమును దానయయి సర్వసాక్షియయి వెలయుచు, నిష్కళంకుఁడయి, నిరంజనుఁడయి, నిర్వికారుఁడయి, నిర్వికల్పుఁడయి, నిరవద్యుఁడయి, నిర్ద్వంద్వుఁడయి, ఆత్మమూలుఁడయి, ఆనందమయుఁడయి, అద్వితీయుఁడయి విలసిల్లుచున్న మహానుభావునిఁ బ్రార్థించుచున్నాను. లోకములును, లోకాధిపతులును, లోకస్థులును పోయినతరువాత నలోకమగు గాఢాంధకారమున కవ్వల నేకాకియయి యెవ్వఁడునివ్వటిల్లునో ఆమహామహుని సేవించుచున్నాను. నాట్యరంగంబున నర్తించు నర్తకునివలె బహువిధ మూర్తులను ధరించి యెవ్వఁడు వర్తించునో, ఎవ్వని వర్తనమును దేవతలు, మునులు మొదలగువారెవ్వరును నెఱుగలేరో, అట్టి నామరూపక్రియా రహితుని, నిర్మలుని, నిరామయుని ధ్యానము చేయుచున్నాను. సర్వసంగములను

బరిత్యజించి, సర్వభూతములయందు సంతతము దయఁగలిగి, సద్వ్రతములుచేసి, మనశ్చపలత యుడిగి మోక్షైక పరాయణులయి వర్తించు మునివల్లభులు నిరంతర మేపరాత్పరుని పదారవిందములను భక్తిపూర్వకముగా భజింతురో, అట్టి పరంధాము నెంతయుఁ జింతించుచున్నాను. జననమరణములు, రూపనామములు, కర్మదోషములు, గుణరంజనములు మొదలగు నవి యేవియు లేనివాఁడయ్యును జగజ్జాలముల నెల్ల సృజింప, రక్షింప శిక్షింపఁ దనయొక్క-మాయచే సర్వమును దానయయి యెవ్వఁడు నిర్వహించునో, అట్టి సర్వశక్తునకు నమస్కరించుచున్నాను. అనంతమై, అమోఘమైన శక్తియు నాశ్చర్యకరమగు వర్తనమును గలిగి, జ్యోతిర్మయమై, సర్వసాక్షియై, మాటలకు, మనస్సునకు, జ్ఞానమునకు గోచరముగాని సచ్చిదానంద స్వరూపముతో నెవ్వఁడు దీపించునో, అట్టి నిత్యానందునకు భక్తితో వందనములు చేయుచున్నాను. ఏ మహామహుఁడు నిరంతర శాంతతఁగలవాఁడో, నిరుపమానమగు నిత్యానంద సుఖము నెఱిఁగినవాఁడో, ఏ మహాపురుషుఁడు కైవల్య సామ్రాజ్య పథమున కధీశ్వరుఁడో, అట్టి నిరవద్యునకు, వేదాంత వేద్యునకు, మహా సౌమ్యునకు, భక్తిగమ్యునకు, అనాదినిధనునకు, అప్రమేయునకు, విజ్ఞానమయునకు, క్షేత్రజ్ఞునకు, సర్వజ్ఞునకు నమస్కరించుచున్నాను. అభంగురమగు దయారసముచేఁ దరంగితమగు నంతరంగముతోఁ జెలంగుచు, నింద్రియ వర్గమునెల్ల వీక్షించు వాని కాశ్రయభూతుఁడయి, సత్యమనెడి నీడతో వెలయుచు, సకలమునకు కారణభూతుఁడై, జితేంద్రియుఁడై, అతీంద్రియుఁడై, ఆత్మమూలుఁడై, నిష్కా-

రణుఁడై, నిష్ప్రపంచుఁడై, చరాచర ప్రపంచజాలమునం దెల్ల నుల్లసిల్లుచు, సచ్చిదానందమూర్తియై విరాజిల్లు నట్టి పరంధామునకు వందనము లాచరించుచున్నాను. యోగ మను మహాగ్ని సంయోగముచేత కర్మములనెడి కాష్ఠ సంఘ ములనెల్ల గాల్చివేల్చిన మహాయోగీశ్వరులు రాజ యోగము వలన నిశ్చలచిత్తులై, సుజ్ఞాననేత్రముచేతనే పరమ పవిత్రుని సందర్శించి హర్షింతురో అట్టి పరాత్పరుని భజించు చున్నాను ధర్మార్థకామములనెడి వర్గత్రయమును విసర్జించి నిష్కాములైన నిరవద్యులైన పండితోత్తము లేపురాణ పురుషుని సేవించి పరమగతి నొందుదురో, తన్నాశ్రయించిన ముముక్షువులకు నక్షయతనువులం బ్రసాదించి, యే యధోక్ష జుఁడు కరుణాకటాక్షముల వీక్షించి వారిని రక్షించునో, ముక్తాత్ము లేమహాత్ముని ననవరతము కీర్తింతురో, ఏకాంతులు నిరంతర మానందరసాక్రాంతులై, ఏమియుఁ గోరక యేయనంతుని దివ్యవైభవముల నుతింతురో, శ్రుతిస్మృతులు సంతతము సముత్కంఠతతో ముక్తకంఠముగా, అవ్యక్తుఁడు ఆనందమయుఁడు, అఖిలమున కాదియయినవాఁడు, అధ్యాత్మ యోగముచే నందఁదగినవాఁడు, అంతట నిండియున్నవాఁడు, అణువున కణువయి, మహత్తునకు మహత్తునై ప్రకాశించు వాఁడు, సర్వేశ్వరుడు, సర్వశక్తుడు, సదానందుడు అని యేపరమేశ్వరునిఁ గొనియాడుచున్నవో, అట్టిపురాణపురుషుని నా హృదయమున సంస్మరించుచున్నాను. అగ్నిహోత్రుఁడు తన శిఖలను, సూర్యుఁడు తన కిరణములను వెలినిడి మరలఁ దమలో నడఁగించుకొను లాగున తనదివ్యతేజముచేత నే మహాపురుషుఁడు పిపీలికాది బ్రహ్మపర్యంతమయిన జంతువు

లను, సమస్తలోకములను, నామరూప భేదములతోఁ దోఁపఁ జేసి మరల హరించునో, ఎవ్వఁడు మనోబుద్ధీంద్రియములెల్లఁ దానయై గుణములకు ప్రచారము గలిగించునో, ఎవ్వఁడు స్త్రీ పున్నపుంసకమూర్తియుఁగాక, దేవతిర్యఙ్మనుష్యాది మూర్తియుఁగాక, గుణక్రియాది భేదములులేక సదసత్తులు మొదలగు వానిచేతఁ బ్రకాశింపక వెనుక సర్వమును దానయై ప్రకాశించునో, అట్టి సర్వవ్యాపకుని సంస్మరించుచున్నాను" అని బహువిధములఁ బ్రార్థించి తన హృదయ కమలమున సకలహృదయాన్తర్వర్తి యగు జగన్నాథమూర్తిని నిలుపు కొని మానస పూజావిధానముల సావధానముగా సేవించి, మిక్కిలి వేడ్కతో నాతని ముఖమునందుఁ దనచూడ్కులు నిలిపి మరల నిట్లు ప్రార్థింపఁదొడంగెను.

పరమేశ్వరా! నీవు సకల జీవజంతువుల సంభాషణము లను అత్యాదరతతో వినుచుందువనియు, శరణార్థులను గరుణించు నిమిత్తము చనరాని తావులకు చనుదువనియు, భక్తులత్యను రక్తితోఁ బిలిచిన నత్యాతురతతోఁ బ్రత్యుత్తర మిత్తు వనియు, నిత్యము నతి జాగ్రత్తతో సమస్తమును జూచు చుందువనియు ననుభవ జ్ఞాన సంపన్నులగువారు నిరంతర ముద్ఘోషించెదరు. గాని, ఆ విషయమున నెంతవఱకు సత్య మున్నదో తెలియఁ జాలకున్నది. ఇదిగోఁ జూడుము. తెగి పోయిన కాలు సేతులనుండి నెత్తురు కారి శరీర మంతకంతకు బొత్తిగా బలహీన మగుచున్నది. చీమలు, దోమలు మొదలగునవి యాపుంటికి ముసురు చుండుటవలన బాధ ఎక్కువగు చున్నది. తీవ్ర వేదనకు సహింపలేక ప్రాణము లెగసి పోవుటకు ప్రయత్న పడుచున్నవి. తర తరముగా

ధైర్యము తఱిగిపోయి మూర్ఛ వచ్చుచున్నది. ఇటువంటి ఆపత్సమయమునకన్న నన్ను రక్షించుటకు నీకు మఱియొక కాలము ఎప్పుడు తటస్థించును? నీవు దయాశాలి వగుట వాస్తవ మయినచో దురవస్థ ననుభవించుచున్న నా ప్రార్థన నంగీకరించి ప్రసన్నుఁడవై నా హృదయమున నావరించు కొని యున్న యజ్ఞానాంధకారమును దొలగించి, నీ దివ్య మంగళ స్వరూప దర్శనమును నేత్రోత్సవముగాఁ బ్రసా దించి, నన్ను నీ పదారవిందములందుఁ జేర్చుకొమ్ము. జన్మ సంబంధమగు దుఃఖము నింతటితోఁ దొలఁగింపుము. జనన మరణ రూపమయిన సంసార చక్రమునఁ బరిభ్రమించుచు గింజుకొనుచున్న నన్ను మెల్లగా దానినుండి తప్పించి సార్థక జన్మునిగాఁ జేయుము. లక్ష్మీపతీ! ఆశ్రిత భక్త వత్సలా! శరణాగత కల్పద్రుమా! మునీంద్ర హృదయార విందమందిరా! యోగీంద్ర వంద్యా! గోవిందా! అని నుతించుచు తన హృదయ కమల కర్ణికా మధ్యమున దివ్య తేజోమయమైన రూపముతో ప్రత్యక్షమై సేవ నొసగు చున్న శ్రీకృష్ణమూర్తినిఁ గన్నుల కఱవుదీఱ సందర్శించి యత్యానందమునొంది తనలోఁ దానిట్లు చింతించెను.

ఓహో! నేనింతసేపు ఎక్కడనున్నాను? సర్వలోక రక్షకుఁడగు పుండరీకాక్షుఁడు బహిరంతరముల నెల్లెడల నిండు కొని తేజరిల్లుచు పరిపూర్ణ చంద్రకిరణముల కరణి నతి శీతలములైన కనికరపుఁజూపులతో నా తాపమును జల్లార్చుచు నవాఙ్మానసగోచరమగు నఖండ పారవశ్యమున నన్నుఁ జొక్కించుచు నాలోపలనే తాండవమాడుచుండగాఁ గనుఁ గొనలేక త్రొక్కటపడి మఱియెక్కడనో దూరమున నున్నట్లు

విచారపడుచు, తానేతానై యుండగా తాననువాడెవ్వడని అవయములను దన్నుగా నెంచుకొని యెంతయు భ్రాంతిపడి యడుగునట్టి జడునివడువున దుఃఖమయమగు నజ్ఞానమువలన సుజ్ఞానమును మఱచి యింత పర్యంత మరణ్యారోదనము సేయుచుంటిని. పరమపురుషుఁడగు జగన్నాథమూర్తి అనయము నా హృదయమున వసింపుచు భక్తజన గమ్యమై మిక్కిలి రమ్యమగు దివ్యరూపమును పరమయోగిగమ్యమై మహాసౌమ్యమగు సుస్వరూపమును, బ్రహ్మవిద్గమ్యమై విగతసామ్యమగు నీరూపమును ఆనందకరముగాఁ బ్రసాదించు చుండగాఁ దెలిసికొనలేక, విషయ సుఖములనెడి దుస్తంత్రము లను, అంతఃకరణములనెడి దుర్మంత్రులును, వాంఛలనెడి వంచకులును, కామక్రోధాదులనెడి వీరులును, శబ్దాదులనెడి శూరులును, నాగాదులనెడి పరివారమును, ప్రాణాదులనెడి భటవర్గమును, వచనాదులనెడి సేనానాయకులును పరివేష్టించి కొలువగా నిరంకుశాధికారము చెల్లించుచు, సంతసిల్లుచున్న జీవుఁడగు మహారాజునకు రాజధానిగానున్న యీ శరీరమును పోషింపవలెనన్న యాస్థచే దురవస్థలనుభవించుచు మోహా మయమగు ప్రమాదమనెడు మదిరారస పానమువలన మత్తు తలకెక్కినందున బ్రహ్మానంద సుఖానుభవమునందిచ్ఛలేక తుచ్ఛసుఖముల కేకారుచు దుర్వినీతుడనై కొండవంటి దుఃఖమువచ్చినను నిమిషమాత్రమున తృణప్రాయముగా నెగురఁగొట్టి యుల్లాసమును గలిగించు బ్రహ్మోపాసనామార్గ మును గమనింపక మాయాంధకారమునఁ జిక్కువడి దిక్కు గానక త్రొక్కట పడుచుంటిని. వివేకహీనతచే భర్తను వదలి పరపురుష సాంగత్యమువలన బహువిధ బాధల నను

భవించు మందయాన చందమున మందమతినై పరాత్పరుని సేవింపనొల్లక దుర్గంధమయమగు శరీరమును పరమార్థముగా నెంచుకొని విపరీతభ్రమలకు లోనైతిని; వినయవివేక సంపదలఁగొదలి విశ్వాసమునకు పాత్రమైన కళత్రమును వదలి చెడుతిరుగుళ్ళు తిరుగమరిగిన అంకులాడి నెంతయు పొంకముగాఁ గొనియాడి సంతసిల్లు నీచునివలె యుక్తాయుక్త పరిజ్ఞానశూన్యుఁడనై పురుషోత్తముని వినుతించి సంతుష్టినొందక యీ పాపదేహమును నుతింప సాగితిని. సుఖమును దుఃఖముగాను దుఃఖమును సుఖముగాను దలఁచుకొన్న నాయవివేకము నెంత మెచ్చుకొందును? అని బహువిధములఁ దన్నుఁదా దూషించుకొని, అంతశ్చక్షువుయొక్క మధ్యభాగమున లోకమునను్న సౌందర్యమెల్ల నేకీభవించి యొక్కమారె మూర్తీభవించిన లాగున మించుచు నీలమేఘశ్యామలమై యతికోమలమైన మేనితో సర్వదేవతామయియగు దేవకీదేవి గర్భమునుండి యావిర్భవించి, తన దివ్యతేజః పుంజములతో పురిటిల్లునంతటిని మిక్కిలి మంజులముగా రంజింపఁజేసి, మహాత్ముఁడగు నందగోపుని ప్రియసుందరియగు యశోదాదేవి కన్నులకుఁ జల్లగా ముద్దులమూటఁగట్టినట్లు తద్దయు నొప్పుచున్న శిశురూపమున నమోఘములైన లీలలు గావించిన యానందమయుఁడు వెలయుచుండగాఁ గన్నులపండువుగా సేవించి చిత్తమును నాతని పదారవిందముల గుత్తముగా నిలిపి, ఇతఁడేగదా గోవిందుఁడు; ఇతఁడేగదా గోపాలుఁడు; ఇతడేగదా గోపికా మనోవల్లభుఁడు; ఇతడేగదా గోవర్ధన పర్వతమును గొడుగుగాఁ బట్టినవాఁడు; ఇతడేగదా రాధామనశ్చోరుఁడు;

ఇతఁడేగదా వేణుగాన విశారదుఁడు; ఇతఁడేగదా అర్జున ప్రియ సఖుఁడు; ఇతఁడేగదా కంస విధ్వంసకుఁడు; ఇతఁడేగదా కాళీయ గర్వ భంజనుఁడు; ఇతఁడేగదా మద్దికవ గూల్చినవాఁడు; ఇతఁడేగదా గోపసుందరుల మందిరములఁ బాలువెన్నలు దొంగిలించిన వాఁడు; ఇతఁడేగదా రుక్మిణీ ప్రాణనాయకుఁడు; ఇతఁడేగదా పదునాఱువేల రాచకన్నియల నేలుకొన్నవాఁడు; ఇతఁడేగదా కుచేలుని దరిద్రమును హరించి మహదైశ్వర్యము నొసంగినవాఁడు; ఇతఁడేగదా పార్థునకు సారథ్యము చేసిన వాఁడు; ఇతఁడేగదా నరకాంతకుఁడు; ఇతఁడేగదా భక్త వత్సలుఁడు; ఇతఁడేగదా కుబ్జకు పూర్వసౌందర్య మొసగిన వాఁడు; ఇతఁడేగదా మల్లయుద్ధమునఁ జాణూర ముష్టికుల ద్రుంచినవాఁడు; ఇతఁడేగదా కువలయాపీడ మను మద గజమును సదమదము చేసినవాఁడు ; ఇతఁడేగదా గురువునకు మృతసుతునిఁ దెచ్చియిచ్చి సంతోష పఱచినవాఁడు; ఇతఁడే గదా జగన్మోహనుఁడు; అని తనివితీఱని చూపులఁ బలు మాఱు చూచిచూచి ఈప్రకారంబుగా స్తుతించెను.

తరుణారుణ ప్రభాపటలిని ధిక్కరించుచు, నిగనిగల నించుచున్న రత్నమంజరుల కాంతులతో నెంతయు వింతగా వించుచున్న కిరీటము శిరఃస్థలము నలంకరింప, సలలితములగు కపోలఫలకములకు నొకలీల మెఱుగువెట్టుచు చకచ్చక లీను చున్న మకరకుండలములజోడు చెవుల నల్లలనాడ, తుమ్మెదల కిమ్ముగాఁ గమ్మని తావులఁ గడలకుఁ జిమ్ముచున్న వనమాల యును మెఱుంగులు తుఱంగలించుకౌస్తుభహారమును గళమున వ్రేల, లేనగవు మిషమున నర్ధచంద్రుని యందమును డిందు పఱచు నెన్నుదుట గమగమావలచుచు విలసిల్లుచున్న కస్తురి

తిలకము సిస్తునింప, విమలకమల దళముల విలాసమును గరము పరిహాసముచేయు విశాలలోచనములనుండి వెలికి నిగుడుచున్న రాగరస పూరితములగు విలోకనములు భక్తలోకమును నానందింపఁజేయ, జగద్భరణ లక్షణ విచక్షణములైన శంఖ చక్రాది ప్రధాన సాధనములు నిస్తులద్యుతి ప్రశస్తములై హస్తములవెలయ, చిత్కటాక్షమాత్రమున సమస్త చిదచిద్విధాన ప్రయాసమును సార్థత నొందించుచు నిందిరాదేవి క్రొక్కారు మెఱుంగు తెఱంగున నురస్థలమున వెలుంగ, వల్లెవాటుగా వేసికొన్న పసిడిదువ్వలువ యింద్రధనువు చందమున నెంతయు నందగింప, జీవరత్నములు దాపిన గండపెండెరము ఝుళంఝుళ ధ్వనులతో కాలియం దలరు చుండ, నిగనిగ జిగుల మిగుల రంజిలుచున్న యుపరంజి పాదుక లడుగుఁదమ్ములఁ గులుకుచుండ జగన్మోహనా కారముతో నిలుచున్న నీ వైభవము వర్ణింప నెవ్వఁడు శక్తుఁడు? అనంతకోటి బ్రహ్మాండ నాయకా! అనాథరక్షకా! ఆపద్బాంధవా! ఆర్తజన శరణ్యా! నీకు నమస్కారము! నమస్కారము! నమస్కారము.

ప్రకృతియనెడు పాదొక్కటియు, సుఖదుఃఖము లనెడి ఫలములు రెండును, సత్త్వరజస్తమము లనెడి వేళ్లు మూడును, ధర్మార్థ కామమోక్షములను రసములు నాల్గును, త్వక్చక్షుశ్శ్రోత్ర జిహ్వాఘ్రాణములను నూడ లయిదును, క్షుత్పిపాసలు శోకమోహములు జరామృత్యువులను స్వభావము లారును, చర్మరుధిరమేదో మాంసమజ్జాస్థిశుక్లము లనెడి పై పొరలేడును, పాణిపాదశిరః కంఠకుక్షివక్షము లనెడి పంగ లెనిమిదియు, నేత్రనాసికాదులనెడి రంధ్రములు తొమ్మిదియు,

ప్రాణాపానవ్యానోదాన సమాన నాగకూర్మ కృకర దేవదత్త ధనంజయములనెడి యాకులు పదియు, జీవేశ్వరులను పక్షులు రెండును గలిగి వెలయుచున్న సంసార వృక్షమును రక్షింప, శిక్షింప నీ వొక్కడవే కర్తవు నీ మాయచేత మోహింపఁ బడిన తెలివిమాలిన మనుజులు నిన్ను నానారూపముల భావింతురు. తెలివిగల పండితులు తత్త్వమును శోధించి నానావిధ రూపములనెల్లను నీవేయని నిశ్చయింతురు. అఖిల భూతముల కాధారభూతుడవైన నీయందు నిర్విరోధమగు చిత్సమాధి బలమునఁ దమ చిత్తములను గుత్తముగాఁ జేర్చి ఆనందతరమగు సదానందము ననుభవించు మహాను భావులు నీ పదమను మహానావ ప్రాపున దుస్తరమగు భవ సాగరము నతిసులభముగ నిస్తరింతురు.

మందమతులు కొందఱు తామే సర్వజ్ఞులమని భావించు కొని, కొఱగాని విషయములఁ గొన్నిటినిఁ దెలిసికొని, నీమహా మహిమ నెఱిగినవారయ్యును నిన్ను స్మరింపకుందురు. అట్టి వారికి దుర్గతి సిద్ధింపక తప్పదు. ప్రాప్యప్రాపకములనెల్ల నీవ యని నిశ్చయించుకొని మనస్సును నిశ్చలముగా నీయందే చేర్చి, నీకు భక్తులై, మిక్కిలి యనురక్తితో నెవ్వారు వర్తింతురో అట్టివారు నిర్భయులై నిరంతరము నీచేత రక్షింపఁబడి నిరాంతకముగా నిత్యానంద మనుభవింతురు. అవాఙ్మానస గోచరమై, ఆద్యంత శూన్యమై, గుణజన్మకర్మ రహితమై వెలయుచున్న నీ యొక్క నామరూపములను మహాత్ము లెఱుగుదురు. శుభకరములైన నీ నామ రూపముల నెవ్వారు సర్వదా వినుచు, పొగడుచు, సంస్మరింపుచు, ధ్యానింపుచు నీ పదపల్లవములందుఁ దమ యుల్లముల నిలిపి సంతసిల్లుదురో వారు

జనన మరణాది దుఃఖముల నెన్నడు నొందనేరరు. దుష్టశిక్షణార్థమై, శిష్టరక్షణార్థమై, ధర్మ స్థాపనార్థమై ప్రతి యుగమునందును రామకృష్ణా ద్యవతారముల నెత్తి అమానుషములైన లీలావిశేషములను గావించి, లోకముల నుద్ధరించు సర్వేశ్వరునకు నీకు నమస్కరించుచున్నాను.

అని బహువిధములఁ బ్రశంసించి, సంశయ విధ్వంసనముజేసి, ఇంద్రియముల నణచివేసి, మనస్సును జెదరకుండఁ గుదిరికగా నిలిపి, రేచక పూరక కుంభక మార్గములచేత సుఖముగా శ్వాసమును బ్రహ్మ రంధ్రమున కెక్కించి, చిణీనాదము, చిణిచిణీ నాదము, ఘంటా నాదము, శంఖ నాదము, వీణా నాదము, తాళ నాదము, వేణు నాదము, భేరీనాదము, మృదంగ నాదము, మేఘనాద మనఁబడు దశవిధ ప్రణవ నాదముల విని చొక్కుచు చిదాకాశమను బయల సహస్రార కమలమను సౌధము లోపల గంగా యమునల సంగమమగు రంగస్థలమునఁ బ్రతిష్ఠగన్న పుర్యష్టనాడికాగ్రమగు బ్రహ్మావర్తమునఁ గీర్తింపఁదగిన దివ్యజ్యోతి దర్శనము చేసి యానందించుచు, సంకల్పవికల్పములు, మానావమానములు మొదలగువాని నెల్ల నుక్కడంచి అహంకారమను గాఢాంధకారమును గడచి సుజ్ఞానమను దివ్యప్రకాశముతో నలరి, మాయాశక్తినిఁ గనుగొని, విశ్రాంతిఁగని మొయికలోఁ గలిసి, నివాత దీప కళిక చందమున నిశ్చలతనొంది సచ్చిదానంద పరిపూర్ణ స్వయంప్రకాశమును గన్నులగని, సర్వమును మఱచి, పరాకాశమునఁ బ్రకాశించుచు, తన్మయునై, చిన్మయుమై, అద్వి

తీయమై, అఖండమై, అవాఙ్మానస గోచరమై, బ్రహ్మానంద సుధారసమును పానముచేయుచు పరవశత నొందియుండెను.

—♦ తత్త్వము, నాదనామక్రియ రాగము - అటతాళము ♦—

సంసార వృక్షాగ్రమున హింసపడనేల సద్గురుని సేవించుమీ॥ వీసమైనను నీకు మోసమెన్నడులేక భాసిల్లి శ్రీ పరబ్రహ్మవై బరగెదవు ॥సంసా॥ భూతపంచకమందు బుట్టినటువంటి యమదూతలకు లోబడకుమీ! హేతుభూతము లెరిగి నీతితప్పక సదా ప్రీతితో గురుగొల్వుమీ॥ సంసా॥ కాదు పొమ్మనితన్ని గదిమినను శ్రీగురుని కాలు చేతులు పట్టుమీ! వేదవేద్యంబైన బోధచే నీదుకడు బాధలణగించురు సుమీ! ॥సంసా॥ అఖిలభవరోగముల కాధారమైనట్టి అస్థిరపుతనువిది సుమీ। సకల ధర్మములు గురుసన్నిధిని గుర్తెఱిగి సౌఖ్య పదవినిజేరుమీ ॥సంసా॥ ఎంచరానటువంటి సంచి తాగ్నులచే దహించ బడుచుంటివి సుమీ! మించి వైరాగ్యమును పొంది శ్రీసద్గురుల పంచబడి సుఖియించుమీ ॥సంసా॥ గేలియై యీ యింద్రజాలమును గని వట్టిబేలవై చెడితివి సుమీ! వాలాయమున గురుని పాలబడి నీదుఃఖజాలములు ద్రోలగించుమీ॥ సంసా॥ ఎన్ని తపములు చేసి యీ జన్మ మెత్తితివో నిన్ను నీలో జూడుమీ! తన్నుతాగనుగొన్న ధన్యునకు భువిలోన జన్మలేదని నమ్ముమీ ॥సంసా॥ అరయమంతిన వేంకటాచార్య పదసేవ ధరచలింపక చేయుమీ! పరిపూర్ణ బోధ నీ కెరిగింతునని గొప్ప బిరుదు బూనెను జూడుమీ! ॥సంసా॥ భూతలంబున యడ్ల రామదాసుడు దెల్పు బోధ చెవులార వినుమీ! యే తీరునైన నీ పాతకములణచి యొక జ్యోతివై ప్రకటించుమీ ॥సంసా॥

---

# వైరాగ్యము

"ప్రియస్నేహితులారా! వైరాగ్యం బనగా అన్నిటి యందు వాంఛలేక యుండుటయేయని పెద్దల యభిప్రాయము. ఈ దేహమెత్తినదిమొదలంతము వరకు దుఃఖమే యనుభవించును. అదెట్లనిన? ఈ దేహము తల్లిగర్భవాసమందుండు కాలంబున మలమూత్ర క్రిమి కీటకాదుల వలనను, జఠరాగ్నిచే తపించుచు తల్లి భోజనము సేయగా గర్భములో సందులేక, నిండియుండుటచేత శ్వాసము విడుచుటకు శక్తి లేకను జన్మకాలమందు ప్రసూతి వాయువుచే పర్వతాగ్రము నుంచి తలక్రిందై బడు క్రిమివలె భూమియందుబడి దుఃఖించుచు మలమూత్రములలో పొరలాడుచు గర్భవేదన గలిగినను, చీమ, దోమ, వృశ్చికాదులచే కాటుబడినను చెప్పుటకు నోరురాక దుఃఖించుట చేతను, యౌవనంబున కామాతురుడై కామాగ్నిచే కాలుచు భార్యలేక పోయెననియు, బిడ్డలు లేక పోయిరనియు, ధనము లేక పోయెనను దుఃఖము చేతను. జరామరణములు గలిగి జడమై అనిత్యమై దుఃఖస్వరూపమై మలమూత్ర మాంసశల్య రక్తక్రిమి నరములపై చర్మము పొదిగిన జంత్రపుబొమ్మవలె కరచరణాద్యవయవాకారమై యరిషడ్వర్గములకు నాలయమై ఆది మధ్యాంతములయందు సర్వదా దుఃఖముగలది శరీరమని యెఱుంగక పామరము చేయుచుండెడు మూఢుల యవివేకమే దేహాభిమానము. ఇదియే సంసారబంధము. ఎట్లనిన సంసారంబను వృక్షంబునకు అవ్యక్తంబను మూల ప్రకృతి పాదు. సత్వ రజస్తమో గుణములు వేళ్ళు, మేలు కీడులు పండ్లు, శాస్త్ర దృశ్యంబగు కర్మనాచరించుట, ధనాభిలాష, విషయాను

భవేచ్ఛ ముక్తియును చతుర్వర్గమును, ఉప్పొంగులుసాదిగా గల పక్షసంబులును, త్వక్కు చక్షువు ఆది గాగల యింద్రియంబులు జటలు, ఆకలియు దప్పియు కామక్రోధాదులును, జనన మరణ స్వభావములును, చర్మంబును,రక్తంబును మొదలగునవిశాట్టలు;పృథివ్యాపస్తేజోవాయురాకాశమనోబుద్ధ్యహంకారంబులు కొమ్మలు, శ్రోత్రనేత్రాది పంచేంద్రియములు ఆకులు, చతుర్దశేంద్రియ విషయములు చిగుళ్ళు, ప్రియాప్రియములచే చేయు పలువిధములైన కర్మంబులు పుష్పములు యిట్టి యీవృక్షంబున జీవేశ్వరులను రెండు పక్షులు కాపురమున్నవి. ఈ పక్షులలో ప్రధానపక్షి జీవుడు. ఇది యిండ్లు, తోటలు, భూములు, భార్యాబిడ్డలు మొదలగు విషపుముళ్లు గల వృక్షముల చేతను, పొదల చేతను, తీగెల చేతను, పెనగొనబడునదియు, కామక్రోధాది గుణములను దొంగలచే బాధ నొందునదియును, వ్యాధులను పులుల వలన హింసింపబడునదియును, పీడలను కార్చిచ్చులచేత చుట్టుకొనబడినదియును, కాలాకాల మృత్యువులను సింహములచే మ్రింగబడినదియును, ముదిమియను దయ్యంబుచే పీడింపబడుచు, దరిద్రమను కొండవలన కొట్ట బడునదియును, పాపంబులను రక్కసుల వలన భయపెట్ట బడునదియును, సంతోషాహంకారంబులను చండవాయువులచేత ద్రిప్పబడునదియును, ఆశయను పాశంబుచే బంధింప బడినదియును, పుణ్యాపాపలోకంబులను తప్పు త్రోవలంబడి పలుమరు దిరిగి మైచ్చోటను నెమ్మదిలేక యీ జన్మమున కంతముం గానక యిదివఱ కెన్ని జన్మములెత్తెనో యిక నెన్ని జన్మము లెత్తవలెనో యను నాద్యంతము లెఱుగక బాధ, దిగులు, వ్యస

నము మొదలైన వానిచేత చంచల చిత్తమై సూర్యుని యెండ వేడిమిచేత దహింపబడి, కామంబులను వృక్షంబుల నీడల నాశ్రయించి, కొడుకులను, కూతుండ్లను బడయుట కుపాయము బన్ని వారి పోషణార్థమునకు సాధనంబైన కృషి వర్తకము లుంఛవృత్తి మొదలగు వ్యాపారంబు లవలంబించి పుణ్యలోకము మొదలు బ్రహ్మలోకపర్యంతము పరకారణ భూతమైన స్నాన సంధ్యానుష్ఠానములు ప్రయోజనాసక్తి చేయక యుండుట యివి యన్నియు పూర్వపక్షంబుగా జేసి యుండుటయే వైరాగ్య ధర్మంబు. ఇట్టి వైరాగ్యపురుషుడు తన్ను తాను పొగడుకొనక యుండుటయును తాను జేసిన సద్ధర్మముల వెల్లడి చేయక యుండుటయును, అహింసా పరమోధర్మమని యున్నది. గనుక జీవహింస చేయకుండుట యును, తిన్నదనమును, ఓర్పు, గురుభక్తి, చిత్తశుద్ధి, స్థిర చిత్తము, శబ్దస్పర్శాదిచతుర్దశేంద్రియ విషయములందు విరక్తియు, గర్వములేక యుండుటయు, పుట్టుక చావుముదిమి రోగములయందు నిర్భయత్వమును, ప్రియా ప్రియ వస్తువుల యందు సమత్వమును, తన కంటె అన్యమేమియులేదను స్థిర భక్తియు, జనులు లేనిచోట నివసించుటయు, బుద్ధిని పలు విధముల జొరనీయక యుండుటయు, కోరికలు వదలుటయు, మోక్షావస్థయందు ప్రయోజన దృష్టియు అను నీ యిరువది లక్షణంబు లెప్పుడలవడునో ఆ తక్షణంబు ప్రత్యగాత్మ యొక్కయు, పరబ్రహ్మయొక్కయు చేరికను ప్రత్యక్షముగా జేయదగిన విమర్శనమునం దధికారియగును.

ఇట్టి వివేకులయినవారు విచారించి యీ దేహము నీ భోగములు హేయము లనియు, దుఃఖకరము లనియు

నెరింగి, జన్మ రహితమయిన మోక్ష మెవరివలన గలుగును? ఏ పుణ్యాత్ముల వలన తెలియ వచ్చునని యార్తి బొందుటయే వైరాగ్య మనం బడును. అయితే కొందరు సర్వము విసర్జించిన వారికి కర్మ ఎందు కందురేమో; యీ దేహము కర్మతో సంబంధపడి యుండుటవలన యీ లోకంబున కర్మచే మోక్ష సాధకము జెంద వలయునేగాని యితర వ్యాయామములందు జన్మంబు గడతేరదు. ఇందుకు శ్రీకృష్ణ భగవానులు భగవద్గీతయందు వైరాగ్యంబను పదార్థంబును సంపాదించిరేని యట్టివారలు మంచి నడవడి గలిగి కృపా సముద్రులై తత్త్వం పదములయొక్క అర్థము నెరింగించెడి బ్రహ్మజ్ఞానముతో గూడిన ఒక గురువుచెంత జేరుదురు. అట్టి గురు రూపంబున ఆత్మబుద్ధి చాంచల్యము మాని నిర్మలత్వమును పొంది సాధన చతుష్టయ సంపన్నులై మోక్షాధికారులు గాగలరని చెప్పియున్నారు. గనుక అట్టి బ్రహ్మోపదేశము చేయు సద్గురువు నాశ్రయించుటయే ఆవశ్యకమై యున్నది. భక్త శిరోమణులారా! యిది సత్యము సత్యము సత్యము.

---

## భారత సావిత్రి

అవధరింపుము: ధర్మరాజు ద్వారకానగరంబుననున్న శ్రీకృష్ణదేవునిబిలిపించి కృష్ణా! కౌరవులకును తమకును సంధి చేయవలయునని ప్రార్థించి రాయబారంబును పంపగా నద్దేవుండు అట్లవుగాక యని హస్తినాపురంబునకు వచ్చి తనసారథి యయిన దారకుని బిలిచి విదురునింటికి రథంబును పోనిమ్మనిన నతండు అట్లం జేసెను. అంత విదురుండు

గోపాలదేవు నెదుర్కొని సాష్టాంగ దండ ప్రణామంబు లాచరించి లోకనాయకా! మేలు కలుగు విజయము జేసితిరి. మీ చరణారవిందంబులు గనుగొనుట వలన నేనెల్లభంగుల కృతార్థుండ నయితిని. ఇప్పుడు నాజన్మంబు సఫలంబయ్యె. నా తపంబు ఫలించె. నాపుణ్యంబు లీడేరె. దామోదరా! మీరు నాగృహంబునకు వేంచేయుటంజేసి, జన్మాష్టమియు, మహా నవమియు, అనంత చతుర్దశియు, దక్షిణాయన పుణ్య కాలంబును, ఉత్తరాయణ సంక్రాంతియు, తులా మేష సంక్రాంతియు, దశమియు, ఏకాదశియు, ద్వాదశియు, అమావాస్య లోనుగాగల పుణ్యదివసంబులు మాకు సమకూరె ననుటయు నా దేవకీ నందనుండు విదురునింజూచి అతిశయించిన ప్రజ్ఞయు సకలశాస్త్ర జ్ఞానంబులుగల నీపలుకులకు మెచ్చితిని గావున వలసిన వరంబు వేడుకొమ్మనిన నవ్విదురుండు సంతోషించి పురుషోత్తమా నాయింట వేలకొలది బ్రాహ్మణులు భుజింపవలయు, నామందిరంబున బంధుజనంబులు నిండియుండ వలయుననియు నే శయనించుతఱి కొడుకులు, కూతుండ్రు కలిసి సందడిగా నిండియుండ వలయు ననియు ప్రార్థింపగా నద్దేవుండు అట్లవుగాకయని వరంబొసగె.

అంత శ్రీకృష్ణదేవుని రాకయెఱింగి రాజరాజగు దుర్యోధనుండు విదురుని సదనంబునకువచ్చి మధుసూదను నవలోకించి కమలాక్ష! భీష్మ ద్రోణుల నుల్లంఘించి మా యింటికిరాక శూద్రునియింట భుజించుట లర్హంబె? యనిన విని రుక్మిణీవల్లభుండు సుయోధనున కిట్లనియె.

పరమ భాగవతోత్తముని అన్నంబును గంగాతోయంబును శ్రీ దేవ దేవుని పాదపద్మ ధ్యానంబును ఏకాదశీ

వ్రతంబును పరిశుద్ధంబని పెద్దలవలన యెఱుంగవె. విష్ణుభక్తి పరాయణుం డయిన మనుజుండు నాల్గవజాతిని జన్మించిన వాడయినను శూద్రుండు కానేరఁడు. పరమ భాగవతోత్తముండయిన బ్రాహ్మణు డనంబరగు. సకల జాతులయందును విష్ణుభక్తి లేనివాడు శూద్రుం డనంబరగు. నాయందుభక్తిఁ గలిగిన చండాలునయిన నవమానించు భక్తులు రౌరవాది నరకంబులను జెందుదురు.

రాజేంద్రా! యాదరంబె అడుగవలయు భోజనంబడుగపని యేమి అదియెఱుంగక నాభక్తులను దూషించు నరాధములు రౌరవాది నరకంబులను జెందుదురు! రాజేంద్రా! యాదరంబు నడుగవలయును భోజనంబు అడుంగబనియేమి ? అన్నము జాములో జీర్ణంబగును! ఆదరంబు శాశ్వతంబయియుండును. పగ వానియింట భుజించుట, మాబోంట్లకర్హముగాదు. నీవుమాకు పగవాడవగుటంజేసి నీయింట భుజింపగాదెట్లంటేని పాండవులు మాకు ప్రాణాప్తులగుటంజేసి వారియెడఁజేసిన అపరాధంబు మాయందు నిత్యంబయ్యె పాండవులు మాకు ప్రాణపదంబవుట యెఱుంగవె. ప్రియ పూర్వకంబుగాఁ బిల్చినవారి యింట భుజించుట యుచితంబు. అన్నంబు లేకున్న నాపత్కాలంబు నెవ్వారియింటనయిన భోజనంబు సేయందగును; మీకు మాయెడ ప్రేమంబులేదు మేము అన్నంబులేనివారముఁగాము. సుయోధనా! ఆదరంబు మీద నొసంగిన శాఖిక మాత్రం బేనియుమనంబున అమృతోపమానంబయి యుండును. భక్తి లేక యిచ్చిన అమృతంబేనియు నిస్సారంబుగా నెన్నుదుము. అయినను నాపలుకులు వినగలవాడ వయితివేని నీదురభి మానంబు వదలి పాండవులకు సమభాగంబుగా భూమిపంచి

యిచ్చి మీరు నూరుగురును వారు అయిదుగురును కలసి సుఖంబుగా నుండవలయు. కులంబునకు హానితేవలదు. మీరు నూటయేవురు నేకీభవించి యుండుట కార్యం బదిగాన తదనంతరంబు పన్నెండేండ్లు వనవాసంబు నొక్కయే డజ్ఞాత వాసంబును సలిపివచ్చు ధర్మనందనాదులకేవురికి అయిదూళ్ళు అడుగుచున్నవారు. అవి యేవన ! యింద్రప్రస్థపురంబును, అవంతియు, యమప్రస్థపురంబును, వారణావతంబును యివి నాలుగు గ్రామంబులు అయిదవది హస్తినాపురంబుఁ గోరుచున్నవారు గావున నవశ్యంబు నివ్వందగినవి యనవిని దుర్యోధనుండు శ్రీకృష్ణదేవున కిట్లనియె.

కేశవా ! కయ్యంబుసేయఁగలసుగాని ఏను వాడిగల సూదిమొన మోపిన మాత్రంబేనియు భూమి పంచియివ్వగలవాఁడనుగాను అనుటయు అంత శ్రీకృష్ణదేవుండు సుయోధనున కిట్లనియె. ధృతరాష్ట్రనందనా కపిధ్వజంబును, గాండీవంబును, మెఱయు పాండవ మధ్యముండైన యర్జునుండు నుద్దండగదాదండంబు గిరగిర ద్రిప్పుచు, వేదండంబునుబోలె వృకోదరుండు రణంబునకువచ్చి నిలబడినప్పుడు సకలరాజ్యంబులు నీవె పంచియిచ్చెదవనిన విని సుయోధనుండు శ్రీకృష్ణదేవున కిట్లనియె.

కృష్ణా ! కుందనంబు చందనంబు నందంబున దేహకాంతులు వెలుంగు మదపుటేనుంగులు విడివడిన కరణి మేఘంబులు గర్జిల్లుచు నారథం బెదిరించిన శత్రుసైన్యంబుల నుక్కడగించి బంచిత చిత్రగతుల నడిపింపఁజేయు, నాదిత్యనందనుండైన కర్ణుఁడు సామర్థ్యంబున తేజరిల్లునెడ నీవె చూడంగలవాడవనిన విని శ్రీకృష్ణదేవుం డిట్లనియె: సుయో

ధనా! యీ బలంబు నమ్మితివె. నీయేనుంగులు, గుఱ్ఱంబులు, రథంబులు లేక యొంటరి అయి చిక్కినప్పుడు కర్ణుని పాద చారంబున బలాయనంబు చేయించం గలవాడననియు నటుల నీవు నేను గాక బ్రహ్మవేత్తలగు యాజ్ఞవల్క్యుల యెదుట మద్యపానంబు జేసిన అసత్యవాది నగుదును గాక యని ఉత్తర గోగ్రహణంబున తలపాగాలు దోచవచ్చినప్పుడు పరా జయంబునొంది మగుడి యుద్ధంబునకు బూనిన నీ దుర్యో ధనుం డొక్కరుండు తొల్లి త్రేతాయుగంబున ఆంజనేయుం డొక్కరుండువచ్చి లంక నిశ్శంకంబుజొచ్చి అశోకవనంబు విడిచి రావణుని పుత్రుండయిన అక్షయుని జంపి లంకా నగరంబు దహించి భయంబు చేకొనుటయెఱింగి మరల యుద్ధంబునకు బూనిన రావణుం డొక్కరుండు మీ రిరువురు పురుషులు లోకంబున మూర్ఖులనం బరగుటయు.

ద్రోణాచార్యుం డిట్లనియె; కృష్ణార్జును లేకీభవించి శుక్రుండు స్వాతీగతుండయి యతివృష్టి గురియు చందంబున కాల్బలంబులమీద నాలుగేసి బాణంబులును, అశ్వంబుల పయిన పదునారేసి సాయకంబులు, యేనుంగులమీద నూఱేసి యంబులును, రథంబులపయిన నూఱేసి శరంబులును; ప్రయో గించి బాణవర్షంబు గురిపింప గలవారనిన; అంత సంజయుండు ధృతరాష్ట్రు నుద్దేశించి కేల్మోగిచి సాష్టాంగ ప్రణామంబు లాచరించి స్వస్తిశ్రీకర శ్రీకంఠ వరప్రసాద సహస్రనాగ బల సంపన్నికేతన అగ్నిస్తంభన జలస్తంభన యింద్రజాల మహేంద్రజాల విద్యాసంయుక్తుండయిన ధృతరాష్ట్రనంద నుండగు దుర్యోధన చక్రవర్తి, నూఱుగురు తమ్ములును, నూట ఒక్క తనయులును, బంధువర్గంబును, నూరుకోట్ల

నియోగులును, యేడుకోట్ల అయోనిసంభవులును, పదునాలుగు కోట్ల లలాట పట్టవర్ధనులును, మూడుకోట్ల దండనాయకులు, చతుష్కోటి సామంతులు, కోటి యీటికోలలవారు, నేబదివేలు బానిసలును, కోటి తొమ్మిది లక్షల శుద్ధవీరులును, నలుబదివేల వీరవిండ్లవారును, నాలుగు లక్షల సంగ్రామ విజయులును, పదిహేనులక్షల భద్రజాతి యేనుగులును, అయిదులక్షల సంగ్రామవంతులును, ఆఱులక్షల మహామంత్రులును, యేడులక్షల డెబ్బది తొమ్మిదివేల దళంబుఁ గలిగి విభవంబుతోడ నేలినది హస్తినాపురంబు. ఎక్కినది కనకరథంబు. పెట్టినది మాణిక్య కిరీటంబు. రాజరాజను నామము వహించి, నిత్యకళ్యాణంబును పచ్చని తోరణంబుఁ గలిగి నఖండ మండలాధీశ్వరుండయి ఆఱు ఖండంబులుగా నేలుచు, మూడు ఖండంబులవారిచేఁ గప్పంబులుఁ గొనుచు, కన్నుల చింతామణియు, చేతుల పరసవేది, పాదములు పద్మరేఖలునుఁ గలిగినట్టి దుర్యోధన చక్రవర్తికి వైరి అయి భూభారంబు హరియింపగోరి కిరీటికి సారథ్యము చేయంబూనిన అచ్యుతునకు, హృషీకేశునకు, త్రివిక్రమునకు, చక్రధరునకు, శ్రీకృష్ణ దేవునకు దండప్రణామంబు లాచరించితి ననియె.

తదనంతరం బా వేదవ్యాస మునీంద్రుడు ధృతరాష్ట్రున కిట్లనియె; బ్రాహ్మణులతోడ సద్గోష్ఠియును గంగాస్నానంబును విష్ణుపాదసందర్శనంబును భగవత్కథాశ్రవణంబును అయిదవ వేదం బనంబరగు. భారత కథ రణప్రకారంబు ధృతరాష్ట్రునకు వినిపింప సంజయుని నియోగించి చనియె. అంత ధృతరాష్ట్రుడు సంజయునిఁ గనుంగొని

మహాత్ములయిన పాండవులకు కౌరవులకు ఘోరయుద్ధంబు వాటిల్లునెడ నిఱువాగుల యెవ్వరెవ్వరు మానమానసులై యుండిరి. యెవ్వ రతిరథ, మహారథ, సమరథ, శ్రేష్ఠులు యెవ్వరెవ్వరిచేత నెవ్వరెవ్వరు హతులైరి. భీష్మ ద్రోణు లెత్తెఱంగునంబడి దుర్యోధనుండు భీమసేనునిచేత నెత్తె ఱంగునఁ బడియె; నది విస్తరంబుగా వినిపింపుమనుటయు నంత సంజయుండు ధృతరాష్ట్రు నుద్దేశించి కేలు మొగిచి వినుమని యిట్లనియె.

కౌరవబలంబులో సుయోధనుండునుఁ గృతవర్మయు భూరిశ్రవుండును బాహ్లీకుండును సోమదత్తుండును హాలాయుధుండును నతిరథులును సైంధవుండును (కృతవర్మయు), నీలుండును, వృషసేనుండు మహారథులును బృహద్బలుండును; శకునియు, భగదత్తుండును లక్ష్మణకుమారుండును సమరథులును దండధారుండును, కర్ణుండును. యోధాను యోధులు నర్ధరథులు కృపుండును, అశ్వత్థామయు, ద్రోణుండును, భీష్ముండును నతిరథులును, పాండవ బలంబున యుధిష్ఠిరుండును, కుంతిభోజుండును నతిరథుండును భీముండును, అభిమన్యుండును, సాత్యకియు, ధృష్టద్యుమ్నుండును, ఘటోత్కచుడును నతిరథశ్రేష్ఠులు నకుల సహదేవులును, పాండ్యుడును, సమరథులును ,ద్రుపదామాత్యులును ద్రౌపది పుత్త్రపంచకంబును, శిఖండియు, దుష్టకేతుండును మహారథులును విద్వచ్ఛుండు యీ తెరంబున వాగని నీకు వాకొన నాకు నూకొనఁగలదిగాదు. పదునెనిమిది అక్షోహిణీలు నొక్కటి యయి యెత్తివచ్చెనేని ఒక్క నిమేషమాత్రంబున సంహరింపనోపు ద్రోణుండును దినత్రయంబున కర్ణుండు ఐదు

దినంబులును అశ్వత్థామ అర్థ దివసంబునుం బోరి పాండవ బలంబును దెగటార్తురు. అర్జునుం డొక్కరుండు వచ్చి మన బలంబు నంతయు అర్థనిమిషంబున ప్రతారించి తోరించునని వెండియు సంజయు డిట్లనియె.

ఆదిపర్వంబును (౧) సభాపర్వంబును (౨) ఆరణ్య పర్వంబును (౩) విరాటపర్వంబును (౪) ఉద్యోగపర్వంబును (౫) నివి ఆది పంచకను. భీష్మ పర్వంబును, ద్రోణ పర్వంబును కర్ణపర్వంబును శల్యపర్వంబును సౌప్తిక పర్వంబును నివి అయిదు యుద్ధపంచకములు. స్త్రీ పర్వం బును శాంతి పర్వంబును అనుశాసనిక పర్వంబును నివి మూఁడు శాంతి త్రయంబులు. అశ్వమేధ పర్వంబును ఆశ్రమవాస పర్వంబును మౌసల పర్వంబును మహాప్రస్థాన పర్వంబును స్వర్గారోహణ పర్వంబును నివి అయిదు అశ్వ మేధ పంచకములు.

ఈ పదునెనిమిది పర్వంబులు కృష్ణద్వైపాయనుఁడు రచియించె. మార్గశిర మాసమున కృష్ణపక్షత్రయోదశి దినం బున భరణీ నక్షత్రంబున భారతయుద్ధంబు ప్రవృత్తంబయ్యె.

అందు కృష్ణపక్ష సప్తమి దివసంబున శిఖండిని ముందఱ నిడుకొని అర్జునుండు భీష్మునిఁ బడవైచె; అష్టమి నాడు భగదత్తుండును నవమినాడు జయభద్రుండును దశమి నాడు అభిమన్యుడును ఏకాదశి దివసంబున సైంధవుండును, అర్థరాత్రంబున ఘటోత్కచుండును ద్వాదశి వేకువజామున విరాట ద్రౌపదులును ఆ మధ్యాహ్నంబు ద్రోణాచార్యుండును త్రయోదశి దినంబున అనేకరాజ సంఘంబులు చతుర్దశి మధ్యాహ్నంబు దుశ్శాసనుండును నా సాయంసమయంబున

మహారథుండయిన కర్ణుండు రణంబునఁ బడిరి. పిదప దుర్యో ధన సైన్యంబు ధైర్యంబు వదలి భేరీమృదంగాది వాయిద్య ఘోషంబులేక, వీరాలాపంబులు మాని, హర్షంబుఁదొలంగి సూర్యుండులేని దినంబునంబోలె, చంద్రుండులేని రాత్రి పగిది, కమలదళములువంటి కన్నులు గలిగిన దుర్యోధనుని ముఖంబు కళాహీనంబయి కాన్పించె. ఇట్లు కౌరవసైన్యంబు కర్ణరహితంబై శోభింపదయ్యె.

తదనంతరంబు అమావాస్యయందు శకునియు సులూ కుండు నాదేవుచేతఁ దెగటాడబడిరి. ఆ మధ్యాహ్నంబు శల్యుండు ధర్మరాజుచేత చచ్చె. ఆ సాయం సమయంబున భీమసేనుని గదాఘాతంబున తొడలు విరిగి దుర్యోధనుండుఁ బడియె. ధృష్టద్యుమ్నుండును, ద్రౌపదిపుత్రులు యేవురు ఆరాత్రి అశ్వత్థామచేత హతులైరి. ఈ విధంబుగ పద్దెనిమిది అక్షోహి ణులు, పదునెనిమిది దివసంబులలో సమసె. భీష్ముం డొక్క నాడు పదివేల గుఱ్ఱంబుల, తొమ్మిదివేల యేనుగులను, యేవురు మూర్ధాభిషిక్తులయిన రాజులను జంపి సమరంబు చాలించె. భీష్ముండు పదిదినంబులు, ద్రోణుండు అయిదు దినంబులు, కర్ణుండు రెండుదినంబులు, శల్యుండు అర్ధదినంబు దుర్యోధనుండు అర్ధదినంబు గదాయుద్ధముఁజేసి భీమసేనుని చేత సమసె. సకల క్షత్రియ కారణంబున కురుక్షేత్రంబున భారతయుద్ధంబు ప్రశస్తంబయ్యె. తొమ్మిదివేల యేనుం గులు, యేనుగుకు నూరేసి రథంబులు, రథంబునకు వెయ్యేసి గుఱ్ఱంబులు గుఱ్ఱంబుకు నూర్వుర కాల్బలమున్న యిది ధర్మనందనునకు మూలబలంబు కురుక్షేత్రము జపవేది జనార్దనుండు యూపంబు దుర్యోధనుండు పశువు కర్ణుండు

హవిస్సుపాంచాలి, అరణిభీమసేనుండు, అగ్ని, అర్జునుండు హోతయు, భీష్మ, ద్రోణు లాజ్యంబులు యీ రణంబున ధర్మరాజు యజమానుండై గాండీవంబునస్త్రములనెడి, స్రుక్స్రు వంబులచేత సమస్త రాజ్యంబులను జయించి, నీ హోమ ద్రవ్యముల వారిచే హోమంబులు చేయించె. నిది భారత సంగ్రహంబు. ఈ భారత సావిత్రంబు నెవ్వరేనియు ప్రాతః కాలమందు, మధ్యాహ్నమందు, సాయం సమయంబున పఠించినవారికి సకల కార్యంబులు సిద్ధించి, సహస్రార్జితంబు లయిన దురితంబులుఁ దొలగిపోవునని వేదవ్యాస వచనముఁ గలదు. ఇది చదివినవారికి, వినినవారికి సకల ఐశ్వర్యంబులుఁ గలిగి, పుత్రపౌత్రాభివృద్ధిఁ గలిగి, తదనంతరం బావిష్ణు సాయుజ్యంబుఁ గలుగును.

---

## సాధనచతుష్టయసంపత్తి

శిష్యా! ముందుగా నీవు తెలియదగిన హంశములను బోధించెద; పరాకుమాని నీకు సందేహములు గలిగిన చోటెల్లను భయపడక నన్నడుగుచు నాకర్ణింపుము. సమస్త ప్రాణులును భగవద్రూపులై యుండియు స్వవివర్తము పొంది దేహేంద్రియాది ప్రపంచములో కొంతభాగము నే ననిన్ని, కొంతభాగము నా కన్యమని జీవుడు అనుచున్నాడు. ఇంతే కాకుండా అకర్త అయిన తానే కర్తనని యను కొనును. అటులనే అభోక్త అయినా తానే భోక్త యను కొనును పుణ్య పాప ఫలములులేని తాను పుణ్యపాపఫలములు గలవాడనని యనుకొనుచు యిట్టి భేదదృష్టి రూపమునునుండు అవిద్యచేతను అవివేకియై అనాది సంసారమునందు జీవుడు

మునిగిపోవు చున్నాడు. ఇట్టి జీవులనుచూచి దయాసముద్రు లగు నాచార్య స్వాములవారు (అనగా గురు పరంపరులగు మోక్షానంద స్వాములవారు) విశ్వనాథా వధూత స్వాముల వారికిని, విశ్వనాథావధూత స్వాములవారు నాకును చెప్పిన రహస్యములవల్లను క్రమ క్రమంబున మావలెనే సమస్త జనులును ఆనందస్వరూపులై యుండగోరి నీవు నన్నాశ్ర యించినందున ఆత్మయొక్క స్వరూపమును నీకుబోధించెద, శ్రద్ధగావినుము. ఆత్మ, సుఖమై, నిత్యమై, ప్రకాశమై, వ్యాపకమై నామరూపముల కాధారమై బుద్ధిచేత తెలిసికొన బడనిదై, బుద్ధిని తెలిసికొనునదై, శుద్ధమై, అపారమై యుండు నదియెద్దియో అదియేనేను. అనగా మహావాక్య తాత్పర్య ప్రకారము తనకంటె వేరుగాని పరమాత్మయే తన స్వరూప మనబడు చున్నది. ఇంక దీని విశేషములను వేర్వేరుగా ముందు జెప్పెదను. ఆత్మ వాక్కునకును మనస్సునకును గోచరమగునది కాదు. గనుక అధ్యారోపము, అపవాదమను రెండు మార్గములుగా బోధింపవలయును.

కనుక అందు అధ్యారోప మనగా ఒక వస్తువునం దింకొక దానిని ఆరోపించుట, అపవాద మనగా అట్టి అరోప మును తొలగించుకొనుట; దీనికి ఫలమేమనగా అనేకజన్మము లలో జేసిన సుకృతము వలన ప్రతిబంధ త్రయము వదలి పోయి తన రూపము తనకు తెలియుటయే సచ్చిదానంద స్వరూపమును పొందుటయని గురువర్యులు చెప్పగా నంత శిష్యుండు గురూత్తమా! అట్లైతే సత్తు, చిత్తు, ఆనందమే స్వరూపముగా గల ఆత్మకు దుఃఖము యేకారణముచేత గలుగును? ఈ దేహము శావడము వల్లను, ఈ దేహము

యే కారణముచేత వచ్చినది! కర్మవల్లను కర్మకు కారణ మేమి? రాగాదుల మూలముగా వచ్చును. ఈ రాగాదు లెందువల్ల వచ్చును? అభిమానము వల్ల వచ్చును. అభి మానము దేనివలన గల్గును? అవివేకమువలన గలుగును. అవివేక మెందువలన గల్గును? అజ్ఞానమువలన గల్గును. అజ్ఞానము దేనివలన గల్గును? అజ్ఞానము దేనివల్లను రాదు. ఇది అనాదినుంచి ఆత్మను ఆశ్రయించి యున్నది. ఈ అజ్ఞా నము దేని వల్ల నశించును? ఆత్మానాత్మ విచారమువల్ల ననగా యిది ఆత్మ, యిది అనాత్మ అను విచార మూల ముగా పుట్టిన జ్ఞానమువలన నశించును. ఈ ఆత్మానాత్మ విచారమునకు అధికారి. అనగా అనుబంధ చతుష్టయము గలవాడు. అనుబంధ చతుష్టయ మన నెట్టిది? అధికారి కావలెను. అనగా విషయ సంబంధ ప్రయోజనములేని వాడు కావలెను. అధికారి యనగా నెవరు? సాధన చతుష్ట యము గలవాడు అధికారి. సాధన చతుష్టయ మనగా నెట్టిది? నిత్యానిత్యవస్తువివేకము ఇహాముత్రార్థ ఫల భోగ విరా గము, శమాది షట్క సంపత్తి, ముముక్షుత్వము (1) నిత్యానిత్య వస్తు వివేక మనగా నెట్టిది? బ్రహ్మమే నిత్యము. పంచ భూతములు మొదలైన, దేహాదిప్రపంచంబు లన్నియు అనిత్యమని యెరుంగుట. (2) ఇహా ముత్రార్థ ఫల భోగ విరాగమన నెట్టిది? ఇహ లోకమందు, వనితాది భోగములతోఁ జేరిన, గృహ కుటుంబ ధన ధాన్యముల యందు ప్రీతియు, పరలోకమందు రంభా సంభోగము మొద లగు కోరికలనున్ను, మనస్సున నుంచక, ప్రపంచమునకు కారణ కర్తగా ప్రకాశించు స్వామియెడ విశ్వాసముగా

నుండుట. (3) శమాది షట్క సంపత్తియన నెట్టిది? (1) శమము (2) దమము (3) ఉపరతి (4) తితిక్ష (5) శ్రద్ధ (6) సమాధానము యనునవి. శమ మనగా నెట్టిది? మనో నిగ్రహము. దమమనగా నెట్టిది? జ్ఞానేంద్రియ, కర్మేంద్రియ ములను విషయములలో బడనివ్వక ఆటంకపరచుట, ఉపరతి యనగా నెట్టిది? సకల పాపకర్మంబుల విడిచి, సకలపుణ్య కర్మంబుల జేసి భగవంతుని ప్రీతిచేయుట, తితిక్షయన నెట్టిది? సకలము పోవుటచే వ్యసనములేకయు, సకలము వచ్చుటకు సంతోషములేకయు, సమబుద్ధితో గూడియుండుట, సమా ధానమన నెట్టిది? పెద్దలయెడ జేరి శ్రవణంబుజేయు కాలం బున మనస్సునున్న, యింద్రియములునున్న విషయంబులలోఁ బడనివ్వకనిలుపుట, శ్రద్ధయన నెట్టిది? వేదాంత శాస్త్రంబుల యందు, ఆచార్యులయందు, ఈశ్వరునియందు, అధిక విశ్వాసముతోఁగూడి యుండుట, (4) ముముక్షుత్వ మనగా నెట్టిది? అగ్నిలోఁ బడినవాడు జలమును జూడ గోరెడు చందంబున నెప్పుడు మోక్షము గలుగుననే యతి తీవ్ర పక్షముతోఁగూడి యుండుట.

ఇదియునుంగాక యిట్టి అభ్యాసకులు అంతర్యమునందు ముఖ్యముగా యీ షణ్త్రయ వర్జితులుకావలెను. ఎందువల్ల ననగా నేను కర్తను. ఇది నాదియను నహంకారమే బంధము. నా భార్య నా బిడ్డలు, నా ధనము, నా దేహము అనుటయే జీవత్వము. ఇట్టి యభిమానము విడిచెనేని జీవన్ము క్తినిఁ బొందును. ముఖ్యముగా దేహాభిమానమును విడువ వలయును; లేనియెడ సంసారమను నరకమందు మునుగును గాన నీయీషణ్త్రయములను విచారించి వీటియం

దభిమానమును విడువ వలయును. అదెట్లన భార్యయొక తల్లి దండ్రులకు పుట్టియు, తానొక తల్లిదండ్రులను బుట్టియు జన్మ మందు నాయిద్దరు నొకనాడు రాకపోవుట తెలిసియు నడుమ కర్మబంధముచే అడవి ఉసిరికాయయు సముద్రపు లవణము కలిసినట్లు కలసినను అంతమందు ఒకరి నొకరు విడచిపోవు చున్నారు. కాని యొకరితో నొకరు వెళ్ళుటయును లేదు. ఒకరి నొకరు చావకుండునట్లు చేయుశక్తియును లేదు. గనుక నా భార్యయనంగూడదు; యింక పుత్రులన్న నా పుత్రులను నీవుసృష్టించలేదు నీ భార్యయూ సృష్టించలేదు. ఇదియును గాక పుత్రుండు మృతుండయ్యెనేని నీవు తోడుపోవుటలేదు. నీవు మృతి బొందితివేని నీ పుత్రుండును నీతో వచ్చుటయు లేదు. మృతపుత్రుని నిలుపుకొను శక్తియులేదు. గనుక నాపుత్రు డనుట భ్రాంతియే! అదెట్లనిన స్వప్నమందు గొడ్రాలు బిడ్డలఁగన్నట్లు భగవత్సృష్టివలన నీకొక పుత్రుడుగా తోచెనే గాని యీ పుత్రుని యేలాగున నాపుత్రుడనవచ్చును? భగవ త్సృష్టివలన గలిగిన పుత్రదారాదులను భగవత్పుత్రులన వలెనేగాని తనపుత్రు లనరాదు. ధనము నాది యనిన నీవు జన్మించుతఱితోడ తెచ్చినదిగాదు; అంత్యకాలమందున నీతోడ గొనిపోవుటయులేదు. గనుక నాదే యనంగూడదు. ఈషణత్రయములు నావిగావన్న నీ దేహమైనను నాదిగాదా యనిన? కాదు. ఎటులనంటే ఒకరివద్ద నెరువుతీసుకొన్న యిల్లు వంటిదని యెఱుంగవలయును. సృష్టిమొదలుగా తాచేసికొన్న కర్మముచే ననేకమైన జన్మలెత్తి యంతమునకు కామ్యార్థ మైన సత్కర్మచే నీశ్వరుని వేడుకొనినందున నీ మనుష్యశరీ రము దయచేసిరనిన అట్లయితే స్వామీ! ఈజన్మామెత్తు

జీవుఁడు వీఁడేకదా! పూర్వదేహ ధర్మాదుల నెందుకెఱుగక పోయెను? అనిన గురుండిట్లనియె. బిడ్డా! యీజన్మమున జాగ్రదవస్థయందు మృతిఁబొందిన తలిదండ్రులు స్వప్నావస్థలో బ్రతికియున్నట్లు తోఁచి వారితో మాట్లాడి సంతోషించు నప్పు డిది యొకరును నబద్ధమని తెలియకపోయిరి. వీరు మృతిఁబొందిన వారలని జాగ్రదవస్థలో నెఱిగిన జీవుఁడే తానిప్పుడు స్వప్నము గనుక నేకదా యెందువలన పూర్వాపు వివేకము లేక పోయెను? కావున దేహము విడచి యన్య దేహము కలుగుటచేత పూర్వజ్ఞానమునకు మఱపు గలుగు ననుటకు సందేహము లేదు. అందువలన పూర్వజ్ఞానము లేక మఱచి పంచభూతాత్మకమైన ఈశరీరమునాది యనిభ్రమించి నిశ్చయించుటచేత నొకరికిని పూర్వజ్ఞానము లేకపోయెను.

## — ఈ దేహము యెరువనుటకు దృష్టాంతము —

తాను నివసించుటకు యిల్లును వాడుకొనుటకు పాత్రములను నొకరినడిగి తీసికొని యాయింట ప్రవేశించి కొంత కాల మాయింట సుఖించి యుండగా నాయిల్లుగలవాఁడు నా పాత్రలు నాయిల్లు విడిచి వెళ్ళుమన్నప్పు డత్యాసచే మరపుఁగల్గి యిది నాయిల్లు నాపాత్రలు నేను విడిచి వెళ్ళుట లేదన్నచో నిల్లుగలవాఁడు స్వతంత్రుడగుటచే తనయిల్లు, తన పాత్రలును బలాత్కారముగాతీసికొని పరులసొమ్ము కాసించి యబద్ధమాడినందుకు ప్రభువుచే శిక్షితుంజేయించిన వెనుక తానుండుట కిల్లు మరల నడిగిన నిల్లుగలవాఁడు వీని నమ్మక నిల్లు పాత్రముల నివ్వన ట్లీశ్వరుడు తనను వేడుకొనగా కరుణించి యిచ్చిన మనుష్యజన్మమును సర్వసంపదలునావి నాశరీరము నాబిడ్డలు నాభార్య నాధనము నాయిల్లు అను

యాశచే విడువనోపడో యట్టిపామరుని భగవంతుడు స్వాతంత్ర్యుడగుటచే తన పదార్థములను తా గ్రహించి పామరత్వముచే నాసించి నందుకు నరకమందు శిక్షించి పునర్జన్మమందు వానికి మేలయిన మనుష్య జన్మమును సుఖించుటకు తగిన భోగభాగ్యముల నివ్వక క్రిమికీటకాది శునక సూకరాది జన్మముల నిచ్చి శ్రమఁబొందించు ననిన శిష్యుండిట్లనియె స్వామీ! మృతిఁబొందినవాడు జన్మమునెత్తునురా? యనిన శిష్యా! జాగ్రదవస్థలో జీవుడనుభవించినది చూచినది విన్నది తలంచినది సంకల్పించుకొను వస్తువులు స్వప్నావస్థలో నదియే సత్యముగా ననుభవించునట్లుండును. కనుక యీజన్మలో నాసించిన విషయవాసనలే మరణము నొందునప్పుడు తలంచుచున్నందున పునర్జన్మమున కంకురమై దానికి తగిన జన్మము నెత్తి యనుభవించుగాన నజ్ఞానముచే మృతిఁ బొందినవాడు పుట్టుట సత్యము. ఎప్పుడు బ్రహ్మజ్ఞానము గలుగునో అప్పుడు జన్మరాహిత్యమౌననిన శిష్యుండు అట్లయితే గురూత్తమా! మోక్షసాధనము యిట్లుండ "అపుత్రస్య, గతిర్నాస్తి" అని కొందరు మనుజులు గృహస్థులుగానుండి సంతానవంతులుగాకయే మరణించినవారికి మోక్షములేదని జెప్పుదురనిన; శిష్యా!జ్ఞానమనే పుత్రుండుగాని యీపుత్రుండు గాడన నదివిని వివాహసుఖమెట్లుండును వలలోఁ జిక్కిన లేడివలె నుండును. ఆర్యా! భార్యాబోధలకు వశపడువాడు ఎట్లుండును? ఆడించే మర్కటమువలె నుండును. కుటుంబమును భరించువాని సుఖమెట్లుండును? చాకలివాని గార్దభము పొందినసుఖమువలె నుండును. విషయముల నపేక్షించు వారి నేమనవచ్చును? దీపమునుజూచి నశించు మిడుతలన

వచ్చును. స్త్రీలతోఁగూడిన సౌఖ్యమెట్టి దనవచ్చును? బుర దలోఁబడు పందిసౌఖ్యము వంటిదన వచ్చును. ద్రవ్యాపేక్షకు లోబడిన వారలను యేమనవచ్చును? వెంబడించిన మొక మును గ్రహింపని వారనవచ్చును. దారా పుత్రాదుల కాసించు వానినేమనవచ్చును? పశువులను మేపువాడన వచ్చును. ధర్మకార్యములనుఁజేసి ఫలమునుఁగోరువాని నేమన వచ్చును? సంతబేరముల వ్యవహారకు డనవచ్చును. అట్లైతే ఓపరమదయానిధే! యీప్రకారముగా జీవులు నిత్యమును దుఃఖములనే యనుభవించు చున్నారుగదా యని విచారించు చున్న శిష్యునింజూచి అంత నాచార్యుండు బిడ్డా! మానవులు గృహస్థులుగానుండినను బ్రహ్మచారులుగానుండినను యివి యెల్లను నివర్తించుటకు గురుకటాక్షమున పైని వివరించిన సాధనలు నాల్గును నెవ్వరికింగలవో వారే సాధన చతుష్టయ సంపన్నులగుదురు. వారే ఆత్మానాత్మ విచారణచేయుటయం దధికారము గలిగి తత్వజ్ఞానులై మూలప్రకృతియొక్క తమోగుణకల్పనచేఁ గల్గు యగాధమునుండి విడివడి ముక్తిఁ బొందగలరని జెప్పగా విని శిష్యుండు అయ్యా! మూల ప్రకృతియనునదెట్లు ఉత్పత్తియైనదో నదియేమేమి చేయు చుండునో బోధించుమని ప్రార్థించిన శిష్యునింజూచినంత శ్రీగురుస్వాములవారు జెప్పంబూని రదెట్లనిన?

---

## కాకినాడ పాంచభౌతిక హృదయపురము నందలి బందిపోటు దొంగలపై అర్జీ

ఇహపర విషయసాధనకృత దివ్య స్తాత్వీక ప్రధాన పారమార్థిక వ్యవహార శ్రీ విలాస పరమపద మహారాజ

రాజుగారైన మహారాజశ్రీ సకల బ్రహ్మాండ చతుర్దశభువన హేతూపాధి హైకోర్టు జడ్జీగారైన శ్రీ స్వప్రకాశ గురుసార్వ భౌమ శ్రీ మంతెన వెంకటాచార్య ప్రభువుగారి దివ్య సముఖమునకు.

ఫిర్యాదీ :— గోదావరిజిల్లా కాకినాడలో చేరిన పాంచ భౌతిక హృదయ పురంబున శుద్ధజీవుడు. ముద్దా యిలు :- (1) శ్రీకృష్ణమూర్తి, సా॥ ద్వారకాపురం. (2) కమలమిత్రుడు, సా॥ గగనపురం. (3) కామము. (4) క్రోధము. (5) లోభము. (6) మోహము. (7) మదము. (8) మాత్సర్యము. 3, 4, 5, 6, 7, 8 ముద్దాయీలు సా॥ హృదయపురం. ఫిర్యాదీ సదరు ముద్దాయీలమీద మేజ స్ట్రేటు ఫిర్యాదు యేమనగా :- మజుకూరుగ్రామ కాపురస్థుడు పాంచభౌతిక హృదయపురములో నేను యెల్లప్పుడు కాపుర ముండి యెవరిజోలియునకు పోకుండా, యెవరితోను పరీకు కాకుండా ఉండియుండగా యీ సంవత్సర భాద్రపద బహుళ ఏకాదశీ శనివారమునాటి రాత్రి అజ్ఞానానంద మనెడి సుషు ప్తిలో నుండగా 1, 2, 3, 4, 5, 6, 7, 8 ముద్దాయీలైన శ్రీకృష్ణమూర్తి, దివాకరుడు, కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యాదులతో 2 వ ముద్దాయియైన దివాకరుడు ముద్దాయిల లందరితోటి మరుగుపడి పరీకైనం దున నా యింట్లో మొదటి ముద్దాయి తక్కిన ముద్దాయిల వెంటబెట్టుకొని బందిపోటుగాఁ జొరపడి నా వాకిట యుండే ఘాడా జవానులు అనగా ప్రాణాపాన, వ్యానోదాన సమాన నాగకూర్మకృకుర దేవదత్త ధనంజయులను నెళ్ళగొట్టుచు అంధకారమైన నా హృన్మందిరంబు తలుపులు పగులఁగొట్టి,

నాయింట భద్రపరచిన మందసంబుయొక్క బీగంబులు నీడం గొట్టి, పెట్టెలోనుండే శ్రేష్ఠమయిన జ్ఞానరత్నమును, భగవ ద్దివ్య జ్ఞానమనే ధనమున్ను, శాంతిశమదమములను చక్కెర, తేనె, నేతికడవలున్ను దోచుకొని వెళ్ళినారు. ఇంకా కొన్నివస్తువులు పోయినట్టుగానే యున్నవి. అంతట నా యింటిలో మానసిక షోడశోపచార పూజలు జరుపుటకై నిలుపుకొన్న నేను సదరు మొదటి ముద్దాయియైన శ్రీకృష్ణ మూర్తితో పైసంగతులు బిగ్గరగా పిలిచి మొరపెట్టినను సదరు మొదటి ముద్దాయి తతిమ్మా ముద్దాయిలతో షరీకు అగుటవల్ల నాతో ఏమియు పలుకక, భాషింపక యున్నాడు. అంతట నేను తామసుండనే 40 నెంబరు బాట తలారితో యీ మాటలు చెప్పి విచారించి చంచలమను స్టేషను ఆఫీసరు గారికి రిపోర్టు వ్రాసినాను. అంతట గగనచంచల, అష్టచంచల, నవచంచల అనే పోలీసుకానిస్టేబుల్సు గార్లున్ను, చంచలమను ఆఫీసరుగారును సదరు నేరము జరిగిన స్థలమునకు వచ్చి జాడ వగైరాలు చూచి కేసుయందు ప్రవేశించి 1, 2, 3 ముద్దా యిలను పట్టుకొని పూచీకత్తులు సహా పుచ్చుకుని విచారిం చగా, మొదటి ముద్దాయి యింటికి రెండవ ముద్దాయి వెళ్ళి తక్కిన ముద్దాయిలు ఆరుగురిని రప్పించి ఏకీభవించి దుర్బో ధనలు జేసి నేరము జరిగినట్టు కేసు స్పష్టముగా ఋజువు అయినప్పటికిన్ని కామమనే మూడవ ముద్దాయి చంచల మను స్టేషను ఆఫీసరుగారితో షరీకైనందున కేసు త్రోసి వేసినారు. అంతటనేను 413 సెక్షను ప్రకారం యోచన యను హెడ్‌పోలీసుగారైన జనరల్‌గారికి విశదపరచుకొను టకు నాకు శక్తిలేక శ్రమపడుచు తమ దివ్యచరణములకు

తెలుసుకొనుటకు శ్రీమద్భక్తులను, జ్ఞానవంతులను ఆశ్ర యించి వారి సేవచేసి తిరిగి కొన్నికొన్ని సుగుణమనే రత్న మున్ను, భగవద్దివ్యజ్ఞానమనే ధనమున్ను, శాంతిశమద మములనే సుగుణ రత్నములను సంపాదించుకుని వస్తూ యుండగా సదరు ముద్దాయిలు నాజాడ తెలిసికొని తిరిగి దోచుకుని వెళ్ళినారు అంతటనేను అమనస్కమనే పోలీసు యినస్పెక్టరుగారికి రిపోర్టు వ్రాసుకున్నాను. పరాక్రముడను హెడ్ కానిస్టేబులు యీనెల 24 వ తేదీ పగలు 10 గంటలకు నా కావుకు వచ్చి 23 వ తేదీ రాత్రి జరిగిన బందిపోటు నేరములో సంగతిని గురించి విచారించగా కొన్ని సొత్తులు మణిపూరక పట్టణములో బిడారుచేసియుండ జాడ దెలిపి పట్టుకొనిన సొత్తులనైనం - రెండు శాంతిశమదమమనె చక్కెర, నెయ్యి, తేనెయున్న కడవలున్ను, జఠరాగ్ని, బడబాగ్ని, దావాగ్ని, మిథునాగ్ని, జ్ఞానాగ్ని; అను ఐదు సౌభాగ్యంబులును, శ్రవణమను బంగారు చెవికట్ల జోడు ఒకటిన్ని; మనన నిధిధ్యాసలనే కంకణాలజత ఒకటిన్ని; యిడా పింగళలనె వజ్రపుటంగుళీయములు, సుషుమ్న అనే త్రిమూర్త్యాత్మకంబను సువర్ణపూజా కలశంబున్ను; సదరు ముద్దాయిలను పట్టుపరచుకొని గుర్తు చూచే నిమిత్తము. అమనస్కమనే యినస్పెక్టరుగారు నాపేర ఉత్తర్వు దయ చేయించినారు. నేను ఆ ఉత్తరవు చూచుకొని నేను కాపుర మున్న గ్రామము బయలుదేరి సదరు మణిపూరక పట్టణము వెళ్ళి సదరు సొత్తులు నావేయని పోలీసువారి దగ్గర కైఫి యతు వ్రాసియిచ్చినాను. సదరు మొదటి ముద్దాయి శ్రీకృష్ణ మూర్తి వల్లనే నా యింట్లో చోరీ జరగడమున్ను, సకల

బాధలుపెట్టి దేశాంతరము వెళ్ళి సత్పురుషుల హృదయములలో దాగుకొనియున్నాడు. మొదటి ముద్దాయి చహరా. గజము మొదలుకొని నాలుగు గజముల, నాలుగు అంగుళముల ఎత్తుగలవాడు. నీలమేఘచ్ఛాయ దేహముఁ గలవాడు ఎప్పుడూ పట్టు పీతాంబరము ధరించువాడు, గోపికలతో సంచరించువాడు. ఈ చహరాగల్గిన శ్రీకృష్ణమూర్తిని మనోబుద్ధి చిత్త, అహంకారములను పోలీసు ఉద్యోగస్థులు ఎవరైనా వారంటు లేకుండా గట్టిగా పట్టుకోవచ్చునని సర్వజ్ఞుండను జనరలు పోలీసు ఇనస్పెక్టరుగారి ఆజ్ఞానుసారముగా 1898 వ సం॥ ఆర్డరు ప్రకారము శ్రీకృష్ణమూర్తిని పట్టుకున్నవారికి గొప్ప యీనాం. అనగా మోక్షమనే బిరుదు పొందగలరు. ఈ నెల 25 సెప్టెంబరు తేదీ జారీ కాబడియుండే ఆర్డరు ప్రచురము చేయించినారు. ఇదియునుంగాక మొదటి ముద్దాయి రెండవ ముద్దాయితో షరీకు అవ్వుటవల్ల ఆయుఃవును, అర్థమును అంతయు దొంగిలించుకొని నిర్భయముగా అందరికీ కనబడుచూ వెంట తిరుగుచున్నాడు. 3,4,5,6,7,8 ముద్దాయిలైన కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యములతో గూడి పబ్లిక్‌గా సంచరించక ఎవరికీ కనఁబడక హృదయమందే దాగియున్నాడు. ఇదియునుంగాక 413 సెక్షను ప్రకారము నరహత్య అనగా మొదటి ముద్దాయియైన శ్రీకృష్ణమూర్తి స్త్రీవధ మొదలైన ఖూనీ నేరములు జరిగించిన 376 శెక్షను ప్రకారం చోరీ అనగా స్త్రీలను మోసవిధముగా స్థలాంతరమునకు రప్పించి జారత్వము జరిగించినీ 354 శెక్షను ప్రకారం సిగ్గు చెరచడమనగా గోపికాస్త్రీల యొక్క వస్త్రాభరణములు దొంగి

లించినన్ని 214 శిక్షను ప్రకారం రేపల్లెలో పాలు, పెరుగు, నెయ్యి మొదలైనవి తరుచుగా దొంగిలించుటచే ద్వారకా పట్టణములో తమతల్లియగు యశోదమ్మవారిచేత రోటం గట్టబడుటయును కఠినమైన శిక్షను బొంది తదనంతరము విడుదల కాబడినాడు.

ఈ ముద్దాయిలు పొందవలసిన శిక్షలు :—మొదటి ముద్దాయి శ్రీకృష్ణమూర్తిగారు సర్వకాల సర్వావస్థల యందు భక్తియను పాశంబుచే బంధింపబడి, బద్ధుడుకాబడి భక్తుల హృదయములందు నిర్విచార పరుండై తపోనిష్ఠుడై యుండడమే వానికి కారాగృహ ప్రవేశము. 2-వ ముద్దాయి కమల మిత్రునకు శిక్షయేమనగా ఒకటిగా చేయుబడిన చక్రముగల రథముమీద కూర్చుని వాయువేగ మనెడి వేడికి గర్వమనే కళ్ళెముచే కట్టబడి చరణ విహీనుడైన సారధిచేత నిరాడంబరమైన ఆకాశమార్గమున బహుయోజన దూరమునందు స్వస్వరూప సంధానము లేక వట్రు వాకారము దాల్చి రాత్రులం గనిపించక దివారాత్రులం గడుపుట నేదిగలదో అదియే వానికి కఠినమైన శిక్ష. 3-వ కామము కల్పన చేతనే పుట్టును. దైవభక్తిచేత నశించును. (4) క్రోధము పరులను దూషించుటవలన పుట్టును. శాంతము వలన నశించును. (5) లోభము వివేకము తెలియ నందున పుట్టును. తెలిసిన నశించును. (6) మోహము అజ్ఞానమువలన పుట్టును. జ్ఞానము కలిగిన నశించును. (7) మదము, కుల, ధన, విద్యలచే పుట్టును. అశాశ్వత మని తలంచిన నశించును, (8) మాత్సర్యము సాత్వికము లేనందున పుట్టును. సాధువుల సేవచేసిన నశించును.

ఇందుకు పరిహారము యీ దినవ ఉదహరించిన నా తాలూకు 1, 2, 3 సాక్షులను విచారించి, ఫిర్యాదీ సంగతులు విమర్శించి, న్యాయపరిశీలనచేసి యథార్థముకు కటాక్షింతురని సకల బ్రహ్మాండ, చతుర్దశ భువన, హైతూ పాధియైన హైకోర్టు జడ్జీగారైన శ్రీ స్వప్రకాశ, గురుసార్వ భౌమ శ్రీ మంతిన వెంకటాచార్య ఘనమును గూర్చి మిక్కిలి విధేయుడనై ప్రార్థించుచున్నాను. ఇందుకు సాక్షులు (1) సాత్వికము (2) రాజసము (3) తామసము. దివ్యచిత్తమునకు తేవలెను.

## శ్రీ వెంకటేశ్వర స్తోత్రము

దేవా! మీదివ్య తేజస్సు సూర్యుండెరుంగు మీభుజ బలంబు కోదండంబెరుంగు మీ మహిమ విశ్వామిత్రు డెరుంగు, మీ వందనంబు వసిష్ఠవాల్మీక్యాదు లెరుంగుదురు మీభక్తి దశరథుండెరుంగు మీ సత్యవాక్యంబు కౌసల్య యెరుంగు మీ శాంతగుణంబులు కైకయెరుంగు మీజిహ్వా రుచి శబరియెరుంగు, మీ సాహసంబు వాయునందనుడెరుంగు మీకూర్మావతారంబు మందరగిరియెరుంగు మీ స్వరూప భావంబు మూలబలంబు లెరుగుదురు. మీ బాణప్రయోగ ప్రభావంబు రావణకుంభ కర్ణాదు లెరుంగుదురు. మీమత్స్యా వతారంబు మధుకైటభు లెరుగుదురు మీ వరహావతారంబు హిరణ్యాక్షు డెరుంగు. మీనరసింహావతారంబు హిరణ్యా కశ్యపు డెరుంగు మీ పాదప్రభావంబు చక్రవర్తు లెరుంగు దురు మీ రామావతారంబు ఋషులెరుంగుదురు మీ బుద్ధా వతారంబు షోడశసహస్రగోపస్త్రీ లెరుంగుదురు మీకలి

క్యవతారంబు కలియుగరాక్షసు లెరుంగుదురు అని యెక్కుడ నయిన ఓ మాధవా! విష్ణు మహాద్భుతంబులయిన దివ్యనామ ప్రభావంబు మీ రామ నామ ప్రభావంబు అజామీళుడెరుంగు మీరు గోవర్ధనగిరి యెత్తుట దేవేంద్రుం డెరుంగు మీ వదనారవిందంబు వేణునాదంబెరుంగు మీ మిత్ర ప్రభావంబు రుద్రుడెరుంగు మీ సహస్ర నామంబులు పార్వతీదేవి యెరుంగు మీకల్యాణ గుణంబులు ఆళ్వారాదు లెరుంగుదురు మీ పూజసేయ సనకసనత్కు మార సనకసనందనాదు లెరుంగుదురు మీపదధ్యానంబు సేయ రోమశమహాముని అష్టావక్రుడు ఆత్రేయుడు కశ్యపుడు భరద్వాజాదు లెరుంగుదురు మీ అస్త్ర ప్రభావంబు మహా కాయ శిరచ్ఛేదన ధ్వంసకుంభకర్ణ వజ్రదంష్ట్రి వజ్రకుంభ మహోదర మహాపార్శ్వ లంకావశాదులెరుంగుదురు. ఇంద్ర జిత్తు తలగుండ రావణగిరి వజ్రాయుధ సకల దేవతామోక్షా నంద విభీషణ ప్రతిష్ఠాపనాచార్య శ్రీమద్ద్వారావతినిలయా గోవర్ధననిలయా గోపీజనమనోహరా వేణునాదవినోదా శ్రీ పారిజాతాపహరణా శిశుపాలశిరచ్ఛేదనా కాళీయ మర్దనా కౌస్తుభభరణా శ్రీవత్సలాంఛనా శ్రీలక్ష్మీకుచకుంకు మాంకితా యశోదానందనా మధురానాయకా మహాముని గణసేవితా యీషణత్రయత్యాగా అక్రూరవరదా గజేంద్ర వరదా నారదవరదా ప్రహ్లాదవరద ద్రౌపది అభిమాన రక్షణా పాండవపక్షపాతీ విదురునివిం దారగించినవాడా ప్రణతవాల్మీకి సనకసనందన సనత్కుమార యోగీంద్ర దేవా బృందారక అప్రమేయ అగోచరా క్షీరాబ్ధిశయనా వటపత్రశయనా వారిజనాభా విశ్వామిత్ర గౌతమ జమదగ్ని

వసిష్ఠ వాల్మీకి జాబాలి గాలవ ద్వీపవంత ఋష్యశృంగ కుంభజ కౌండిన్య చ్యవన ప్రహ్లాద పరాశర వ్యాస అంబరీష శుక శౌనక రుక్మాంగద అర్జున బలి విభీషణాదులె నిన్ను యెరుంగరు నేనెరుగ నెంతవాడ? నీవు పరబ్రహ్మవు పరంజ్యోతివి యీశ్వరుడవు నీదివ్యనామ సంకీర్తన యెవ్వరు చదువుదురో యెవ్వరు వ్రాయుదురో యెవ్వరు విందురో వారు ఆయురారోగ్య ఐశ్వర్య సంపద సమృద్ధి గలిగి యుందురు. నీ భక్తులయిన వారికి అటుమీద మీరున్న వైకుంఠంబు దయచేతువుగాన నిందుకు సందేహంబులేదు. శ్రీ హరీ సింహగిరి నరహరి నమో నమో శ్రీ వెంకటేశ్వర నమస్తే.

—♦ కీర్తన ♦—

భజనాసేయుదామురండి। రామభక్తిచే గలుగును। ముక్తిమార్గామండి గడియా। సేపు। మీకు రామసంకీర్తన। గావింపగా మనసురాదా। అయ్యో కాలము। వ్యర్థముగాదా॥

యముడు కరుణింపడని తెలియులేదా। మన రాముని వేడిన। పామరత్వముబోదా। భజనశేయుదాము రండి॥

మాయా సంసారము। కాయమస్థిరమాని। మర్మాము। మదిలో తెలియండి। యేమి మనవెంటరాదు చూడండి। ముందు మనవారి దార్శిబట్టకండి। వట్టి ఆరాట। మేటికి। శ్రీరామచంద్రుని॥ భజనా॥

అండా పిండాండ। బ్రహ్మండ మంతటాను। నిండీన జ్యోతిని పొంది। మదిలో దండి ఆనందము నొంది। మంచి పండువెన్నెలను పొంది। అఖండ పరంజ్యోతి। అండాజేరు కొని॥ భజనా॥

పుట్టుచు గిట్టుచు పుడమిలో బొరలుచు । రట్టుజెందు టాయు మేలా ! వట్టి కట్టాడి దేహము చాలా । దీని గుట్టు నెరుంగక కాలా । యముడుబట్టి గొంపోవంగ । పలవ రింపగనేలా ॥ భజనా ॥

మంచి సద్గురుని । పంచజేరి పాద । మంచిత భక్తి పట్టండి । రోగమెంచి మందును గోరండి । రుచుల నెంచక పథ్యముంచండి । ఆశజెందితె । యీ వ్యాధి మించిపోవు నండి ॥ భజనా ॥

నీచాహారంబుల । నెడబాయజాలక యోచనజేసెద వేలా । కరుణచూచితే మంచిది చాలా । పథ్యకారిగాదె యిట్టి లీలా । మన కాలమంత గూడా । కఠినా । మార్గం బేలా ॥ భజనా ॥

ధరను వంటి । మిట్ట । పురనివాసా । వరదాదాసా దాసుమాటా । మంచి ఘనమయిన । రత్నాలమూట । ఘోరదురితాము లెడబాపు బాట । విన్న నరులాకు శ్రీ మోక్షపురమునకు బాటా ॥ భజనా ॥

భజనాచేయుదాము రండి । రామభక్తిచే గల్గును మార్గామండి ॥

—• నాదనామ క్రియరాగం ఆటతాళం •—

నారాయణన్ నారాయణన్ । నారాయణ । భగవన్
నారాయణన్ ॥ నారా ॥

నారాయణ మీ దివ్యక్షేత్రమునకు । నరుగని । చరణములు ।
కారడవిని యామట్టికిలేవె । కదలనట్టి కాళ్ళు
॥ భ । గ । నా ॥

చేరి నీదుభక్తులకు । నమస్కృతులు । చేయని హస్తము లు।
తరుముచు । జీవుని । కరవదలచుకొని । బరగెడి సర్ప
ములు ॥ భ । గ । నా ॥

అగణితముగ । నీకగు చరిత్రములు । బొగడలేని నోరు ।
తెగువతోడ యిరుగడలతో ప్రోగెడి । తోలుడక్కి
తీరు ॥ భ । గ । నా ॥

సుందరాంగ మీ దివ్యస్వరూపము । చూడలేని కళ్ళు ।
యెందయినను బల్ । చీము నెత్తురు । చిందుచున్న
పుళ్ళు ॥ భ । గ । నా ॥

కమలనేత్ర పదపద్మ సుగంధము । గానని నాసికము ।
పలువురిచేతను । పట్టి కుడించెడి । కొలిమితిత్తి సరము
॥ భ । గ । నా ॥

యిష్టముతో శ్రీరామకీర్తనము । వినగోరని చెవులు ।
దట్టమయిన శిలలందు నగలతో । తొట్రువయిన
తొరలూ ॥ భ । గ నా ॥

ప్రియముతోడ హరిపాదములకు ప్రణమిల్లని తలపండు ।
దయ । దాక్షిణ్యము లేక పడుండెడి । దండి రాతి
గుండు ॥ భ । గ । నా ॥

పుణ్యాత్ములు మీ । కథలు పాడ । నుప్పొంగనట్టి మేను ।
దున్నటకయినా గేటిదుక్క కక్కరకురాని ప్రాను
॥ భ । గ । నా॥

లోకనాథమిము । గదిసియాత్మలో । యేకమవని మనసూ ।
కేకలిడుచు । చలించుచుండెడి । కాకియనుచు దలచూ
॥ భ । గ । నా ॥

అవయవములు। యే దినమున। తమసేవ అందిసేయ కున్న। గావున యడ్ల రామదాసుని। భావ మిదే నన్నా॥ భ। గ। నా॥

---

## జావళీ (ఆనందభైరవి)

ఎందుకీ తొందారా। సుందరాకారా నీ। పొందు గూడెద। తాళరా। గోపాలకృష్ణా। నీ పొందుగూడెద తాళరా॥

సంధ్యావేళలో। మావారందరూ। తెలివిగా। ఉందురిచ్చోటమన। పొందు జరుగదు వేరే। మందిరంబున। కేగివచ్చెద। పందిరినూలు। పట్టెమంచము। అందు పూ। కల్పంబునను। రతిబంధము। సుఖమొంద జేసెద। ఎందుకీ తొందరా॥

నావెంట దిరుగకురా। నే నీ వెంటవచ్చెదను। నామాటంటె నమ్మవదేమిరా నంటిపయి। చేయివేశి వర సాలు దెల్పేవు। కంఠసూత్రపుమగని। కంఠబడినతంట। యింటిలోపల తగదురా। నిన్నె మనంటె నామనసు నొచ్చును। యేజంటలంటిన। గడియలో। పడకింటికె। త్రోవిది యేజనరా। యెం॥

కౌగిటికిదివేళా। గాదురా నీకింత। కక్కుర్తిపని యేమిరా। బాగుబాగు రవిక। పట్టి నీ గోళ్ళతో। లాగితె యెలాగు। బొంకుదు। నాస్వామి। కాగలదురా। నీవు కోరిన। కార్యమది। యొకజాములోపల। రాగదర మాష

టికి । మాలోగిటికి । పడమరకిటికీ దారిని । యెందుకీ ॥తొందరా॥

అత్తవారిళ్ళలో కొత్తకోడండ్రాకు । కత్తులాతో సాముగా । అత్తాయుండావలె । అందారిచిత్తాము । వత్తిగిల్లిన రహస్యముండాదు నా స్వామి చిత్తినీనయి తిరిగినందున । చిత్తినీయని ! నలుగురందురు । చిత్తనీనయి తిరుగనాడు । పెత్తనము । సమకూరునటరా ॥యెందూకీ తొందరా॥

సన్నుతా గుణధైర్యానను । కన్నావారిల్లయితే । నిన్నాటంకము లుండునా । సన్నసన్నగవచ్చి । సమయామిదేయని । నిన్నుజూచినమనసు । నిలచునో । నిలువావో । నా చిన్నెలన్నియు నీకే । తెలియును । వన్నెకాడదయాబ్ధిమానస । కన్నకల్ప । శశాంక । నీకన్న రతిసుఖమున్నదటరా । యెం॥

యేజామాయెరావచ్చి । పోజాలనిను బాసి । బేజారయ్యెర మనసూ । భోజనంబులవేళ । పోయివచ్చెదస్వామి । ఏజంటా । నామగడే మానుకోనునో బేజభవుజపుడయి జమానస తేజగూడెద । రాజశ్రీ ఆనందగజపతి । రాజమహారాజేశ్వరీ ॥యెందుకీ॥

---

# శ్రీ రామాయణము యొక్క అంతరార్ధము

ఇట్లానందాబ్ధి నోలలాడుచున్న శిష్యునింజూచి గురువర్యులు సంతసించి ఓజ్ఞానపుత్రా! శ్రద్ధాభక్తుండవై వినుమని యిట్లనియె. ఆనందమయమగు అపరోక్షమను నయోధ్యాపట్టణమునందు పరబ్రహ్మమను దశరధుడు కలడు. అతనికి యిచ్ఛాశక్తి క్రియాశక్తి జ్ఞానశక్తులను మువ్వురు భార్యలు కలరు. వారిలో జ్ఞానశక్తియను కౌసల్యాదేవి గర్భమునం దాత్మయను శ్రీరామమూర్తి అవతరించి అవ్యక్తమగు బాల్యావస్థచే స్వస్వరూప జ్ఞానమును మఱచి అజ్ఞానమయమగు జీవాత్మయే తానని భ్రమించి దేహేంద్రియాది ప్రపంచమునందు అభిమానముంచి శ్రవణమను వసిష్ఠోపదేశముచేత మరల దెలివి దెచ్చుకొని వైరాగ్యమను లక్ష్మణమూర్తిని వెంటదీసికొని, మననమను విశ్వామిత్రునితో బయలుదేరి పంచమహాపాతకములను పర్వతములను గడచి జ్ఞానమను తీక్షణ బాణముచేత నావరణమను తాటకిని వధించి ఇచ్ఛయను మారీచుని సముద్రములోనుంచి వికారములను సుబాహు ప్రముఖులగు కరకు రక్కసుల బెక్కురనుక్కడంచి దురాచారమను శిలను కాలితో తన్ని. సదాచారమను నహల్యను మన్నించి, ఏకాంతమను మిథిలాపురము ప్రవేశించి, శాంతమను జనకుని సందర్శించి, అసూయయను శివధనుస్సును విఱిచి ఆనందమను సీతను వివాహము చేసికొని, ప్రతిఘటింపవచ్చిన మదమును పరశురాముని భంగపరచి, మోక్షమను సాకేతనగరముజొచ్చి, తాను జీవుడుకాడని నిశ్చయించి జీవత్వ త్యాగమను పట్టాభిషేకమును వహింపబూని, క్రియాశక్తియను కైకవలన చపలత్వమను విఘ్నము సంభ

వింపగా, బ్రహ్మమను దశరథుని బాసి, మోక్షమను నయోధ్యను వదలి ఆనందమను సీతయు, వైరాగ్యమను లక్ష్మణుడును దోడునడువ బయలుదేరి చలచిత్తమను సరయునదిదాటి బుద్ధియను గుహుని యాదరణవడసి నిక్షేపమను మహారణ్యముజొచ్చి తపస్సను చిత్రకూటముననిల్చి అహంకారమను విరాధుని బొలియించి, మనస్సను కాకాసురుని నలయించి సంకల్పమను కన్నుగ్రుచ్చి నిర్వికల్పమను కన్నిచ్చి వీర్యమను నగస్త్యుని నాశ్రయించి ధైర్యమను నస్త్రమును పరిగ్రహించి, కామమను శూర్పణఖను విరూపిగాజేసి, ఆగామికర్మలను ఖరదూషణత్రిశిరులను సంహారముజేసి, ఇచ్ఛయను మారీచుడు వాదింపగా రాజసమను రావణుడు దంభమను సన్యాసివేషముతో ఆనందమను సీతను నపహరించుకొనిపోగా నాత్ముడను రాముడు విజృంభించి, ఇచ్ఛయను మారీచుని గీటడంచి యానందమును సీతనుగానక యమోఘమను విచారమునుపొంది వైరాగ్యమను లక్ష్మణుడు వెంట నడువ విక్షేపమను కీకారణ్యములో విచ్చలవిడి దిరుగుచు వివేకమను జటాయువును, విమలత్వమను సద్గతి నొందించి, చింతయను కబంధుని వధించి, సంతోషమను శబరిని గాంచి, మనోవికాసమను పూజ నంగీకరించి, నిదిధ్యాసమను హనుమంతునితో సఖ్యమొనరించి, సప్తవిధ జన్మంబులను, సప్తతాళములను భేదించి, భయమను వాలినిగూల్చి, నిర్భయమను సుగ్రీవుని దేల్చి, నిదిధ్యాసమను హనుమంతునిఁ బురికొల్పగా నతడు మోహమను సముద్రమును లంఘించి, లోభమను లంకిణినిఁ ద్రుంచి, దుర్వాసనలను రాక్షసులనెల్ల మట్టుపెట్టి, యానందమను సీతను గనిపెట్టి, సంకల్పమను

అశోకవనమును పాడుచేసి, అజ్ఞానమను జంబుమాలిని నురుము జేసి, సంశయమను అక్షయుని శిక్షించి, విపరీతమను నింద్ర జిత్తునుం దిరస్కరించి, భ్రమయను పాశమును ద్రెంచి, రాజస మను రావణుని ధిక్కరించి, మానమను మహాగ్నిని ప్రజ్వ లింపజేసి, దుఃఖమను లంకను దగ్ధముజేసి, మోహమను మహాసముద్రము దాటి మరలివచ్చి ఆనందమను సీతయొక్క సంగతి తెలియజేయగా, నాత్మ యను రాముడు, మోహమను సముద్రమును భంగపెట్టి, నిశ్చలత్వమను సేతువును గట్టి, సత్యమను విభీషణునిఁ జేపట్టి, విపరీతమును నింద్రజిత్తుని నెదిరించి, సందేహమను నాగపాశములోఁ జిక్కి, సద్విచార మను గరుత్మంతునివలన విడుదలనొంది, తామసమను కుంభ కర్ణుని సంహరించి, భ్రమయను శస్త్రముచే వైరాగ్యమను లక్ష్మణుడు మూర్ఛిల్లగా, నిదిధ్యాసమను హనుమంతుని ప్రోత్సాహపరచి, నిష్ఠయను సంజీవ పర్వతమునుఁ దెప్పించి, వైరాగ్యమను లక్ష్మణుని మూర్ఛదేర్చి, విపరీతమను నింద్ర జిత్తుని బోకార్చి, సంచితమను మూలబలంబునంతయు సాధన మను మోహనాస్త్రముచే నిర్మూలముజేసి, దుర్వాసనలను నసురులనెల్ల నాశనముఁజేసి, సద్వాసనలను కపిసైన్యములను సంతరించి, గాంభీర్యమను చాపము నెక్కుపెట్టి, రాజసమను రావణుని నెదిరించి, జ్ఞానమను దివ్యబాణమును ప్రయోగించి, యహంకారమను నమృత కలశమును భేదించి, ఇంద్రియము లను పదితలలు ఛేదించి, మానాగ్నినుండి పరిశుద్ధత్వమును వహించి వెలువడిన యానందమను సీతనంగీకరించి, బ్రహ్మ

మను దశరథుని వీక్షించి, మోక్షమను నయోధ్యాపురము చేరి, జీవత్వనివృత్తి జేసికొని, బ్రహ్మమను దశరథుడే తానై కేవల బ్రహ్మసాక్షాత్కారమును వహించి, సహస్రార పద్మ మనెడి స్వర్గ సింహాసనమున ఆత్మారాముడు పట్టాభిషిక్తుడై సుఖించుచున్నాడు. కాన ఇదే రామాయణమునకు ముఖ్య రహస్యార్థముసుమా అని బోధించిరి.

మంగళమహా శ్రీ

ఓమ్ - తత్సత్

శ్రీ రామార్పణమ్.

శ్రీ ఆంజనేయ పవర్ ప్రెస్, ఏలూరు.



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA113B179 |
| పుస్తకం పేరు | పారమార్థిక విచారము |
| తారీఖు | 26/10/24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 55 |
| పెద్ద సైజు పేజీలు | |
| ఖాళీ పేజీలు | CI/BCI |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Ravikala |
| పేజీలు విడదీసినది | Ravikala |
| స్కాన్ చేసినది | Haseena |
| పరీక్ష చేసినది | hema |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good. |